# సమర్పణ.

:o:

వైశ్యకులపారావార సుధాకరుండును, వేదవేదాంత పురాణేతిహాస గూఢార్థప్రతిపాదకుండును, సంస్కృతాంధ్ర, ఆంగ్లేయ, జర్మనీ భాషాప్రవీణుండును, బి.యే బి. యల్, డి. జి. డబ్లియూ, కె. టి, ఇత్యాది బిరుదాంకితుండును కరింగాల్ జమీన్ దారుకు డిస్ట్రిక్టు మునసఫ్ న్యాయస్థానాలంకృతుండును మదీయ ప్రియజనకుండును అగు బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజులవారి దివ్యచరణారవిందముల కీపొత్తంబు నతిభక్తితో నర్పించుచున్నాడను. ఇయ్యది మోహాంధకారంబునఁబడి దిక్కుగానక పరితపించు మానవులకు జ్ఞానప్రదీప మగుఁగాక!

ఇట్లు దాసానుదాసుడు,

ఆత్మూరి రామమోహన్ రాయ్.



ఓమ్.

# పరమార్థవినోదములు.

## ప్రథమభాగము.

—:·:—

### 1 వ కథ.

ధర్మరాజులవారు బాల్యమున విద్యనభ్యసించునప్పుడు ఉపాధ్యాయులొకనాడొక పాఠమునిచ్చిరి. మరునాడు తోడిబాలురందరు పాఠమునువప్పగించిరి. క్రొత్త పాఠములను నేర్చుకొనుచు నిట్లు చాలదినములు గడచినను ధర్మరాజు తన కింకను మొదటిపాఠమే చక్కగ రాలేదని

చెప్పుచుండుటచే గురువులవా రాగ్రహచిత్తులై కఠినముగ గొట్టిరి. ఎంతగొట్టినను ఆబాలుడు కంటతడియైనను బెట్ట కుండుటచే ఆయన మిగుల నాశ్చర్యమునొంది అందులకు కారణమడిగెను. అప్పుడా బాలుడు అయ్యా! మీరు నాకి చ్చినపాఠమున రెండుమాటలు గలవు. ఒకటి "సత్యమును బల్కుము" రెండవది "ఓర్పు గలిగి యుండుము". అందు మొదటిది పూర్తిగ నభ్యసించితిగాని రెండవది పూర్ణముగ నభ్యసింపనైతి, ఏలయన మీరు నన్ను కొట్టినప్పుడు మొదట నోర్చుకొంటినిగాని నెత్తురు వచ్చిన పిదప నోర్చుకొనలేక పోతినని చెప్పెను. గురువు యాబాలుని జ్ఞానవికాసమున కచ్చెరువంది తన పాండిత్యమునకు విచారమును బొంది, నాకింక మొదటి వాక్యమే బోధపడలేదని చెప్పి యబ్బాలుని ముద్దిడి నీవే నాగురువై యుండుట కర్హుడవనెను.

## 2 వ కథ.

రావణాసురుని ప్రధానమంత్రి యొకనాడు రావణు నితో "దేవరా, తాము అణిమాద్యష్టసిద్ధులను స్వాధీనము

చేసుకొని యుండ రామరూపమును దాల్చి సీత నేలవశపరచుకొనకుంటివి" రని యడిగెను. అందులకు రావణుఁడు "ఓసీ యవివేకీ, ఏమంటివి? పరమపావనమగు శ్రీరామచంద్రుని దివ్యరూపము నొకసారి మనమున ధ్యానించినచో, రంభా తిలోత్తమాదియప్సరసలు గూడ వల్లకాటిలో నుండు పీనుగుల బోలిదికంటె హేయముగా దోపరా! అట్లుండ యొక మానవాంగనకై నాచిత్తము యానింపగల్గునా? యని ప్రత్యుత్తరమిడెను.

## ౩ వ కథ.

ఒక శిష్యుడు తనగురుస్వామియందు పూర్ణమైన భక్తిగలవాఁడై తనగురుమూర్తి యొక్క నామజపము చేయుచు నొక నది పై నడచిపోయెను. అది యాగురువు చూచి "అవా! నా నామమందింత మహిమగలదా! నాశక్తి నాకే తెలియకున్నదే, అని తలచి తానును యానదిని "నేను, నేను" అనుచు దాటపోగెను, గాని పాపమతడు మునిగి [illegible]నొందెను. భక్తిచే నెంతటి యసాధ్యమను కార్యమైనను చేయ

వచ్చును, గాని యహంకారముచేనాశనమే సంభవించును

## 4వ కథ.

భోజమహారాజొకనాడు ఋషిసత్తములతోడను, సామంతరాజులతోడను, పండితోత్తములతోడను, సభాసీనుడై సభికులంజూచి "మీలో నెవ్వరెవ్వరు స్వర్గమునకు బోగలైదరో చెప్పవలెను" అని వినోదముగ బ్రశ్నించెను. అప్పుడందొకడైన యీప్రశ్నకుత్తరమీయజాలక మానము దాల్చి కొందరును, తలలువంచికొందరును, గుసగుసలాడుచు కొందరును యూరకుండిరి. అంతలో కాళిదాసమహాకవిలేచి "మహాపాలాగ్రణీ, స్వర్గమునకు నేనుబోయినబోవచ్చు"ననెను. ఇదివినినంతనే సభాసదులందరును నవ్వసాగిరి. రాజాశ్చర్యముతో "ఓ కాళిదాసా, యీసభయందుండగుతపోనిష్ఠాగరిష్ఠులూరకుండ నీవిట్లుసాహసించి యిట్లు బల్కితి"వనెను. అప్పుడు కాళిదాసు "ఓరాజశేఖరా, నేనుజెప్పినదాని యర్థమును మీరుగ్రహించక యిట్లు సెలవిచ్చుచున్నారు. నేనుబోయినబోవచ్చుననగా నేను

ఆనాడి అహంకారము ఎవనికిబోవునో వాడే స్వర్గమునకు బోవుటకర్హుడుగాని నేనే పోయెదననుట కాదనిచెప్పెను. రాజువాని చమత్కారమునకు మిగుల నానందించెను.

## 5 వ కథ.

అహామద్ అనుభక్తుడు తన మరణకాలమునందు తనలో తాను "అప్పుడేగాదు, అప్పుడేగా" దని యనుకొనుచుండెను. చెంతనున్న కుమారుడు దీనింజూచి "నాయనా ఏమట్లనెద"వని యడిగెను. అప్పుడాభక్తుడిట్లు జవాబు జెప్పెను. ఓకుమారుడా! నాయిరుప్రక్కలయందును దేవ, తలు నిలుచుండినన్ను స్వర్గమునకు దీసుకపోవుటకై విమానము దెచ్చియుంచిరి. సైతాను నాయెదుట దూరమున నిలిచి "ఓఅహామ్మద్, తుదకు నాపాశములనుండి తప్పించుకొంటివిగదా" యనెను. అందుకు అప్పుడేగాదని నేను బలుకుచుంటిని. ఏలయన గొంతుకలోనూపిరి యున్నంతవరకు సైతానుయొక్క మాయాజాలమునుండి తప్పించుకొనుట కష్టసాధ్యముగనుక నిట్లంటి"నని జవాబు చెప్పెను.

## 6 వ కథ.

పుట్టంధుడగు ధృతరాష్ట్రుని డొకనాడు శ్రీకృష్ణభగవానులను కన్నులార జూడనిచ్ఛగించి యాదేవదేవుని ప్రార్థించెను. అప్పుడా సర్వశక్తుడు ధృతరాష్ట్రునకు నేత్రములనిచ్చి తనయభీష్టమును నెరవేర్చుకొనుమనెను. అంతట నాయంధుడు నేత్రములను గల్గినవాడై శ్రీకృష్ణస్వామిని పరీకించిజూచి మహదానందంబునొంది "హాకృష్ణా కృష్ణా తక్షణమే నన్ను తిరిగి గ్రుడ్డివానిగ జేయుమ" ని వేడుకొనెను. శ్రీకృష్ణులవారు ఆశ్చర్యమును చెంది ఓధృతరాష్ట్రా తిరిగి అంధత్వమునే కోరుచుంటివేలనని ప్రశ్నించెను. అంగులకాయన "హేమహానుభావా! పరమపావనంబగు నీ సచ్చిదానందస్వరూపంబును దర్శించిన కన్నులతో పాపయుతమగు నీప్రపంచమును చూడ నాయుల్లమొల్లకున్నదని జవాబు చెప్పెను.

## 7 వ కథ.

ఒకనాడు రుక్మిణీదేవి శ్రీకృష్ణభగవానుని గాంచి "నా

థా! నిన్ను నమ్మినవారలును, నమ్మనివారలును అందరును నీకు బిడ్డలేగదా, అట్లుండియు అందరిని నీవొకేవిధమున ప్రేమించక నీదాసులచెంతనే యెప్పుడు నుందువు, ఇట్టి పక్షపాతము నీయంతటివానికి తగునా జెప్పుమనెను. అందులకా భక్తవత్సలుడు ఓ ప్రాణనాయకీ! ఒకతండ్రి కిద్దరు పుత్రులుండిరి. అందొకడు సమర్థుడు. రెండవవాడు పిచ్చివాడు. ఆతండ్రి కిద్దరియందును ప్రేమయొకటిగానే యున్నను పిచ్చివాని నెక్కువ జాగరూకతతో గాపాడుచుండును. అకేవిధమున నాబిడ్డలలో ననేకులు తమ స్వశక్తిపైనే భారమునైచి దేహయాత్ర గడుపుచుందురు. కొందఱుమాత్రము వారి భారమంతయు నాపైనుంచి, పసిబిడ్డలవలెనో లేక పిచ్చివారివలెనో దిరుగుచుందురు. కావున సదా వారచెంతనేయుండి వారికి బరిచర్యలు సహితము నేనే చేయవలసియుండును'' అని ప్రత్యుత్తరమిచ్చెను.

## 8 వ కథ.

ఒకరాజు లక్షలకొలది ద్రవ్యము వ్యయపరచి యొక

దివ్యమైన దేవాలయము గట్టించెను. అందు భగవంతుని విగ్రహమును బ్రతిష్ఠచేయుటకై యొక సుముహూర్తము నిశ్చయించి యా ముహూర్తమున కందు భగవంతుని విచ్చేయుమని ప్రార్థించెను. నాటిరాత్రి యారాజునకు స్వప్నములో భగవంతుడు గాన్పించి "ఓరాజా నీభక్తికిసంతసించితి. నీవు నిశ్చయించిన ముహూర్తమునకు నన్ను నీదేవాలయమునకు రమ్మని ప్రార్థించితివి నీయభీష్టమును నెరవేర్చవలెననియున్నది, గాని సాధ్యమగునో లేదోయని సందేహము గలుగుచున్నది. ఏలయన నీపట్టణమునకు సమీపమునందున్న మాలపల్లెలో మద్భక్తుండగు నొకమాలవాడు నన్ను దన దేవాలయంబున మాటిమాటికి బంధించుచుండును. నీ ముహూర్తసమయమునకు నాతడు నన్ను విడచిన యెడల నీమనోభీష్టమును నెరవేర్చెదనని చెప్పి యదృశ్యుండయ్యె. ఈకల గాంచినంతనే రాజు ఆశ్చర్యమునలేచి ఆహా మాలవాడట! దేవాలయమును గట్టించెనట! అందు భగవంతుని బంధించుచుండునట! నేను గట్టించిన దేవాలయముకంటె

నిది యెక్కువ సుందరముగ నుండుననుట నమ్మదగినదికాదు. ఐనను జూడవలెనని యెంచి యామాలవాని గుడిసెకు బోయెను. అచట నొక మాలవాడు పద్మాసనాసీనుండై, ధ్యాననిష్ఠయందు మగ్నుడై బాహ్యస్పృహలేక ప్రతిమవలె గూర్చుండుట జూచి యర్చకుడు కండ్లు తెఱచునంతవఱకు నచటనేయుండి "ఓరీ, నీవు దేవాలయమును గట్టించితివట, అందు భగవంతుని బంధించుచుంటివట, దానిం జూపు" మని యడిగెను. బ్రహ్మజ్ఞానముతో ప్రకాశించుచున్న యాభక్తుడు చిరునగవుతో తనహృదయమును చూపి "యిదే నాదేవాలయ" మనిచెప్పి తిరిగి కండ్లుమూసుకొనెను. ఇది వినినంతనే రాజు విస్మయమునొంది "ఆహా, లక్షలకొలది ద్రవ్యము కొల్లబెట్టి గట్టించిన నాయసమానమగు దేవాలయమునకంటె కానిఖర్చుగాని హృదయాలయమే శ్రేష్ఠతరమగుదాయని జ్ఞానము దెచ్చుకొని యామాలవానికి "నీవే నాగురువ" టంచు మ్రొక్కిపోయెను.

9 వ కథ.

ఒక జ్ఞానిచెంతకు నొక రాజుబోయి "స్వామీ భగవం

తు డెట్టివాడో వర్ణించుమనెను. అందుల కాజ్ఞాని మూడు దినములు సావకాశ మడిగెను. మూడుదినములు గడచిన పిదప రాజుతిరిగివచ్చి యడిగెను. కాని యాజ్ఞాని మరిమూడుదినములు గడు వడిగెను. ఇట్లెన్నిదినములు గడచిన నింక మూడుదినములు సావకాశ మిమ్మని యడుగుచుండుటచే రాజు విసికి "ఏమి స్వామీ, ఈచిన్నప్రశ్న కిన్నిగడువులు జెట్టుచున్నారు, కారణమేమ"ని యడిగెను. అందులకాజ్ఞాని "రాజా నీవడిగినప్రశ్న మిగులకఠినమైనది. భగవంతుడెట్టివాడో వర్ణించుమనిగదా నీవడిగితివి. ఆద్యంతములులేని భగవంతుని వర్ణించుటకు యెన్నిదినములు సావకాశము బుచ్చుకున్నను చాలకున్నది. దినములేల యెన్నియుగములు తరచి చూచినను నామహాప్రభు వింకను నపారమైయున్నవాడు" అని జెప్పెను.

## 10 వ కథ.

ఒక రాజు తనకుమారుని విద్యాభ్యాసమునకై యొకగురువుచెంతకు బంపెను. కొంతకాలము గడచినపిదప యా

రాజు కుమారుని జూడవచ్చి పాఠశాలకు బోయి కుమారుని పరీక్షించి సమస్తశాస్త్రములలో నబ్బాలునికి గల పాండిత్యమునకు సంతసించి తుదకు నాబాలుని భగవంతు డెట్టివాడో వర్ణింపుమనెను. ఈప్రశ్నకు బాలుడుత్తరము చెప్పక యూరకుండెను. ఈప్రశ్న గాక యేమడిగినను తక్షణమే జవాబు నొసగు భగవంతుని వర్ణింపుమని యడిగినతోడనే మొద్దువలె నోరుమూసుకొని యూరకుండెను. తోడిబాలురందరు నొక్కి చెప్పిన భగవంతుడు సచ్చిదానందస్వరూపుండనియు, నిర్వికారుండనియు, నిరామయుండనియు, సృష్టికర్త గానియు, నిర్గుణుండనియు పలువిధముల వర్ణించుచుండిరి. కాని యాబాలుడు మాత్ర మెన్నివిధముల నడిగినను జవాబు చెప్పక మౌనముద్రను దాల్చి యుండుట జూచి రాజుగురుల నాశ్చర్యంబునొంది. "అహో, కుమారా విద్య నేర్చినది భగవంతుని దెలిసికొనుటకే గదా, ఆసర్వేశ్వరుని దెలుసుకొనని చదువు ఎన్నిచదివిన నేమి ప్రయోజనము? జగములకెల్ల ప్రభువగు యాపరమేశ్వరునిపై వైరమబూని వాని పేరైన నుచ్చరించనొల్లని నీవంటి దుష్టుని

ముఖము జూడరాదు శ్రీ పొమ్మని నాబాలుని నావలద్రోసెను. అప్పుడారాకుమారుడు "నాయనా, కోపించకుము. మీరడిగిన ప్రశ్న కుత్తరము చెప్పలేనిగాని, మీరు గ్రహించకుంటిరి. భగవంతుని వర్ణింపగలనని మీరు ప్రశ్నించితిరి. వాక్కునకును, మనస్సునకును బుద్ధికిని గూడ నతీతమగు నాపరమాత్మను వర్ణించుటకు నాచేతమైనట్లైనను దరమే! అవాఙ్మానసగోచరుండగు పరమేశ్వరుని వర్ణించుటకు మౌనముకంటె నుత్తమమైన మార్గము నాకు గాన్పించదే" దనెను. ఈమాటలకు తండ్రి మహదానందభరితుడై కుమారుని కౌగలించుకొనెను.

## 11 వ కథ.

పతివ్రతాశిరోమణియగు ద్రౌపది కౌరవులచే మానభంగ ప్రాప్తురాలగుచుండ, నామానినీతిలక నొకహస్తముచే దన వస్త్రము గట్టిగాఁ బట్టుకొని రెండవకరమును పైకెత్తి "హేకృష్ణా! ద్వారకావాసా, అపద్బాంధవా, నన్ను రక్షింపుమని కలపించుచుండెను. ఇట్లు కొంతతడవు

దుఃఖించి భగవంతుని వేడుకొనినవిపప నాయాపద్బాంధవుఁడు వచ్చియామెనురక్షించెను.

అప్పుడు ద్రౌపది "హేకృష్ణా! జగద్రక్షకా! నన్నురక్షించుట కింతతడవేల చేసితివి. నామొర వినినంతనే వచ్చి నన్నేల రక్షింపవైతి"వని యడిగెను అంతటను శ్రీకృష్ణభగవానులు చిరునగవుతో ద్వారకయందుండెడికృష్ణుని కదా నీవు పిలిచితివి. ద్వారకనుండి నీచటకు వచ్చుటకు నెంతకాలము పట్టునో యోచింపు మనెను. అప్పుడు ద్రౌపది "హేకృష్ణ! సర్వవ్యాపివై యున్ననిన్ను ద్వారకీవాస యని పిలిచినందులకుఁ దగినట్లు బుద్ధిచెప్పితివి. గాని మఱియొక సందేహము దీర్చుము. నీవు వచ్చియు నన్నుఁ దక్షణమే రక్షింపక కొంతతడవు ఊరక చేతగానివానివలెఁ జూచుచుంటివి. శరణాగతరక్షకుఁడను బిరుదున కిది తగునా చెప్పు" మనెను. అప్పుడాభక్తవత్సలుఁడు "ఓద్రౌపదీ, నీవు చెప్పినది సత్యమే గాని నీవొకచేతితో నిన్నుఁగాపాడుకొనుచుంటివి. అప్పుడు నిన్ను రక్షించవలసినంత

యవసరము గన్పించలేదు. పిమ్మట భారమంతయు నాపై నుంచి రెండుహస్తములను బైకెత్తితివి. అప్పుడుగదా నాబాధ్యత! అప్పుడుగదా నీవునిజముగ నన్నునమ్మినదానవు, నన్ను నిజముగనమ్మి భారమంతయు నాపైనుంచి నప్పుడె నేను రక్షింతు'నని చెప్పి యదృశ్యుండయ్యె.

## 13 వ కథ

ఏసుక్రీస్తులవా రొకనాడు శిష్యులతో గూడి పోవుచుండఁగా మార్గమధ్యమున నొకచచ్చినకుక్క కనుపించెను. శిష్యులు దానింజూచి "అబ్బా యిదియెంత యసహ్యముగ నున్నది, దేహ మంతయుఁగుళ్లి పురుగులు గారుచు కండ్లు లొట్టలుపోయి యెంతహేయముగాఁ గాన్పించుచున్నదో" యని యనుకొనిరి. అప్పుడా సర్వసముఁడు "ఓ బుద్ధిహీనులారా, ఆకుక్కపండ్లనుజూడుఁడీ. ఆహా, అవియెంతశుద్ధముగాను తెల్లగానుప్రకాశించుచున్నవో! ఎప్పటికైనను మీరు దేనిని జూచినను దానియం దుండెడిమంచినే గ్రహించవలెను. గాని దానియం దుండెడిదోషములను బరికించరాదు"

అని హితవుచెప్పెను.

## 13 వ కథ.

భక్తాగ్రేసరుండగు శ్రీఆంజనేయులవారిని నేడేమితిథి యని యొకరు ప్రశ్నించిరి. అందునకాభక్తుఁడు "నాకు తిథియును తెలియదు, వారమును తెలియదు, శ్రీరామచంద్రుని పాదారవిందములు దప్ప మఱేమియు నాకుఁ దెలియదని" జవాబు చెప్పెను.

## 14 వ కథ.

పారసీకమతోద్ధారకుండును బ్రహ్మజ్ఞానియు నగుజొరోయాస్టరొకనాఁడు కొండగుహయందుఁ దపస్సు చేసుకొనుచుండఁగా, విలువగలవస్త్రాభరణములను ధరించినయొక ప్రాపంచకుఁడా జ్ఞానిని దర్శించి "అయ్యా నాకుజ్ఞానోపదేశముఁ జేయుఁడ"ని యడిగెను. అంతట నాజ్ఞాని వాని చేతికి నొకదీపము నిచ్చి యాచటఁ బ్రమిదలో నున్నవత్తిని వెలిఁగించమని చెప్పెను. కాని యతఁ డెన్నివిధములఁ బ్రయత్నించిన నావత్తి వెలుఁగకుండెను. అప్పుడాతపసి

“ఓసహోదరుఁడా ప్రమిదలో నేమున్నదో పరీక్షించు” మని చెప్పెను. అప్పు డాతఁడు దానిని బరిశీలించి యందుఁ జమురుకు బదులు నీరుండుటఁ గాంచెను. అంతట ‘బోరాస్టరు’ అయ్యా యానీటిని బారబోసి చమురు పోయుమనెను. అట్లు జేసినను నావత్తి వెలుగనందున నాతఁడు విస్మయము జెంది యందులకుఁ గారణమడిగెను. అంతట నామహానీయుఁడు “ఓసోదరా, వత్తియం దింకను నీ రున్నది అది యున్న శుభ్రముగాఁ బోవువఱకు నెండఁ బెట్టు” మనెను. అట్లు చేసినపిమ్మట దానికి దీపము వెలిగించినమాత్రముననే వత్తి మండెను. అప్పు డామహానుభావుఁడు “అయ్యా మీరు జ్ఞానోపదేశముఁ జేసితిని నింకఁ బొమ్మనెను” గాని యామానవున కదేదియు గోచరించక పోవుటచే ని ట్లుపదేశించెను “నీవే వత్తివి యనుకొనుము నీవు విషయభోగము లనెడునీటి యందు నానుచుంటివి. వానిని విసర్జించి భక్తియనెడిచమురు నింపుము, అట్లు చేసినను నీయందు విషయవాసనయుండును గాన వైరాగ్య మనునెండచే దానిని నిర్మూలముచేయు

ము. అట్లు చేసినగాని నీయందు బ్రహ్మజ్ఞానమనెడిజ్యోతి ప్రకాశించదు" అని బోధచేసెను.

## 15 వ కథ.

శ్రీకృష్ణభగవాను లొకనాఁ డొకభక్తురాలిగృహంబునకుఁ బోయెను. ఆభక్తాగ్రేసరి శ్రీకృష్ణునిదర్శనంబుచే ఆనందపరవశురాలై నేమైన ఫలహారము స్వామికి నియ్యఁదలంచి యేమియుఁ గానక తుదకుఁ గొన్నియరటిపండ్లను నొకగూటిలోఁ గాంచి చిత్తమంతయు నచ్యుతునిమీఁద నుండుటచే నొడలెఱుఁగక, యాపండ్లను నొలిచి తోళ్లను తినిపించుచు గుజ్జును బాఱవేయుచుండెను. ఆకరుణాసముద్రుఁడు చిరునగవుతో నాతోళ్లను భక్షించుచుండెను. ఇంతలో నాభక్తురాలు తనయజ్ఞానమును దెలుసుకొని తాను జేసినయపరాధమునకు మిక్కిలి చింతించి మిగిలినపండ్ల నొలిచి యతిజాగ్రతతోఁ దోళ్లుపాఱవైచి గుజ్జును శ్రీకృష్ణస్వామినోటఁ బెట్టఁగా నామహానుభావుఁడు దానినిగొంచము చప్పరించి తుబుకున నేలపై నుమిచెను. అప్పు డాభక్త

రాలు దీనురాలై హే దేవాదిదేవా! నేనేమియపరాధము చేసితి? తోళ్లను బెట్టినపుడు తామచక్కఁగ భుజించి గుజ్జును బెట్టినపు డేల స్వీకరింప కుండిరి? అనియడుగ నామహాను భావుఁడు “ఓభక్తాగ్రేసరీ, నీవు తోళ్లను బెట్టినపుడు నీచిత్త మంతయు నాయందేయుండెను. గుజ్జు బెట్టినప్పుడు నీకు చిత్తచాంచల్యముగలిగి నీమనస్సు కొంత పండ్లయందును, కొంతతోళ్లయందును కొంతస్నేహమందును, కొంతమా త్రము నాయందును నిట్లు చెదరియున్నది. పూర్ణచిత్తముతో నాకర్పణచేసినది తృణమైనను నాకు మిక్కిలిప్రీతికరమని హితోపదేశము చేసెను.

## 16 వ కథ.

ఒకనాఁడు భూదేవి మిక్కిలివాడినమోము గలదై దుః ఖించుచున్న సమయమున సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడు భూదేవినిజూచి నీదుఃఖమునకుఁ గారణమేమనెను. అప్పుడు భూదేవి “ఓదేవా! ఎట్టియున్నతములైన పర్వతము లైనను అట్టివిస్తీర్ణమైన వృక్షములైనను సులభముగ మో

మగలను గాని యనృతములాడుమహాపాతకులను భరింపఁజాలక దుఃఖించుచున్నానని చెప్పెను.

## 17 వ కథ.

పరమభక్తుండగు శ్రీయాంజనేయులవారొక్క గంతున సముద్రమును దాఁటి శ్రీరాముల సాన్నిధ్యమునకు వచ్చి "దేవా, మీయనుగ్రహముచే సముద్రమును సయితముదాటఁగలిగితిని" అని చెప్పెను. అందులకు శ్రీరామచంద్రులు "ఓహో ఆంజనేయా! సంసారమను మహాసముద్రమునే దాఁటగలిగిన నీకీసముద్రము దాఁటుట యొకగొప్పపనియా" యని మందహాసము చేసెను.

## 18 వ కథ.

మహానుభావులగు శ్రీశంకరులవారు ప్రతిదినము వారు పూజచేసికొనినశివప దీర్థప్రసాదములను దూరమునఁ గాచియుండు నొకమాలవానికి ముందిచ్చి పిమ్మట బ్రాహ్మణుల కిచ్చుచుండిరి. ఇట్టినడతబ్రాహ్మణులకుఁ గష్టముగాఁ దోఁచి దానిని సహింపఁజాలక నొకదినము ధైర్యమువహించి

యామహానుభావుని చెంతకుఁ బోయి స్వామీ మీరు సర్వజ్ఞు
లని యనుకొంటిమి. మీవంటి పెద్దలిట్టి నింద్య మగు కార్యము
నేల చేయుచుండిరో తెలియకున్నది. చతుర్వేదములను
కంఠోక్తిగఁ జెప్పఁగలుగు మహానీయులుండ సమస్తశాస్త్ర
ములను నేర్చికొనిన మహాపండితులుండఁగ, యజ్ఞయాగాది
క్రతువులను జేసి కుండలములు ధరించిన మావంటి గౌరవనీయు
లుండఁగ మమ్ములనందరిని నావలకుఁద్రోసి యొక పరమనీచుని
నెక్కువగా గౌరవించుచుండిరి. ఆహా యిది యేమి యన్యా
యమని యొక పెద్దపెట్టున నఱవసాగిరి. అప్పుడా శాంతి
మూర్తి చిరునగవుతో మీ సందేహమును దీర్చెద శాంతము
వహించుఁడని వారిని నెమ్మదిపఱిచి కొన్ని యరటిపండ్లను
దెప్పించి యందరికి నొక్కొక్కటి నిచ్చి నేఁటి రాత్రి ఈపం
డ్లను నెవ్వరును చూడని రహస్యప్రదేశమునఁదిని యుదయము
న నేరండని చెప్పి పంపెను. అమరునాఁ డందఱును బండ్లు
మడిని స్వాములవారి చెంతకు వచ్చిరి. అప్పుడాయన ఓ బ్రా
హ్మణులారా మీరు ఆపండ్లను దినుచుండ నెవ్వరును జూడ
లేదు గదా యనెను. అప్పుడు వారిలో నొకఁడయ్యా నేను

గదిలోఁ దింటివనియు నొకఁడు చీఁకటిలోఁ దింటివనియు, నొకఁడడవిలోఁ దింటివనియు, నొకఁడు ముసుఁగువేసికొని తింటివనియు, నిట్లు పలువిధములఁ జెప్పిరి. పిమ్మట మాలవానినడుగఁగా నాతఁడు "అయ్యా నేను దినలే"దని చెప్పెను. బ్రాహ్మణులు పకపక నవ్వసాగిరి. అప్పుఁడా మాలవాఁడిట్లు చెప్పెను. "అయ్యా నాకు రహస్యప్రదేశ మెంత వెదకినను గాన్పించలేదు. ఎందుఁ జూచినను సర్వాంతర్యామియగు శ్రీమన్నారాయణుండు గనిపించుచునే యున్నాఁడు. ఆజగదీశుఁడు లేనిస్థలము నాకెచటను గన్పించనందునఁ బండ్లను తినలేదు"ని చెప్పెను. బ్రాహ్మణులందఱు వీఁడు మహాభక్తుఁడని గ్రహించి తమయజ్ఞానమునకు సిగ్గుపడి మహానుభావుఁడగు నామాలవానికి మ్రొక్కి యిండ్లకుఁ బోయిరి.

## 19వ కథ.

ఒకనాఁడు యమధర్మరాజు పకపక నవ్వుచుండెను, అప్పుడు మంత్రి "స్వామీ యేల యిట్లు నవ్వెద" రనియడిగెను. అప్పుడతిభయంకరుఁడగు నాయముఁడు "అహో

యేమివింత! ఎట్టివిపరీతము! పరమేశ్వరుని నిత్యకల్యాణదాయకంబగునావైకుంఠము చూడుము, అతిభయంకరంబును దుఃఖదాయకంబును నగునాయమపురిఁ జూడుము. ప్రతిదినము నారాజ్యము మనుష్యకోటిచే నభివృద్ధిఁ గాంచుటయు ననిర్వచనీయసుఖము నిచ్చువైకుంఠమునకు నెప్పుడో యొకరు వచ్చుటయుఁ జూచి నాకుఁ బట్టశక్యముగాని నవ్వు వచ్చుచున్న" దని జవాబు చెప్పెను.

## 20 వ కథ.

ఒకపండితుఁ డొకవివేకి యగురాజుకొద్దకుఁ బోయి "రాజా నేనుభగవద్గీతఁ జక్కఁగాఁ దెలిసికొంటిని. ఏలినవారు పరీక్షించి బహుమానింతురని వచ్చినాఁడ" ననెను. బుద్ధిమంతుఁ డగునారాజు నీవింకను భగవద్గీతఁ జక్కఁగా నేరువలేదని తోఁచుచున్నది. ఇంటికిఁ బోయి చక్కఁగాఁ జదువుకొని వచ్చినచో మంచిబహుమాన మిత్తునని చెప్పెను. వెంటనే యాబ్రాహ్మణుఁడు తిరిగి పోయి పూర్వముకంటె చక్కఁ శ్రద్ధతోఁ జదివి రాజునొద్దకు వచ్చెను.

అప్పుడును రా జదేవిధముగ నీ వింకను బాగుగాఁ జదివి నట్లు కనుపించుట లేదు. తిరిగి పోయి చక్కఁగాఁ జదువు కొని వచ్చిన చో మంచిబహుమాన మిత్తునసెను. ఇట్లెన్ని మార్లువచ్చినను రాజదేప్రకారము చెప్పుచుండెను. పండి తుఁడును విసుగుఁ జెందక యంతకంతకు నెక్కువశ్రద్ధతోఁ జదువుచుండి భగవద్గీతాసార మంతయు మనమునఁ బట్టి క్రమక్రమముగ ననిత్యములగువిషయములందు విరక్తిఁ జెం దుచుఁ దుదకుఁ బూర్ణవైరాగ్యమును జెందిపరబ్రహ్మనిష్ఠాగ రిష్ఠుఁడై రాజును సహితము మఱచి యాత్మానందమున మగ్నుఁడైయుండెను. పండితుఁడు తిరిగి రాజుచెంతకు రానందునఁదానే యాతనిఇంటికిఁ బోయి "ఓపండితోత్తమా బహుమానముకొఱకుఁ దిరిగి యేలరాదైతిరి" అని యడిగెను బ్రహ్మజ్ఞానముచేఁ బ్రకాశించు చున్నయావిప్రుఁడు రాజా నీవేమిబహుమానము నాకీయ గలవు? ఈభూమండలమంత యుసాకు దాన మిచ్చినను దృణప్రాయముగాఁ జూచునం తటిభాగ్యము సంపాదించితిని. నే నిప్పుడు వాంఛాశూ న్యుఁడను బరిపూర్ణసంతుష్టుఁడ నని చెప్పిమానధారినై

యుండెను. అప్పుడు రాజు "ఆహా యిప్పుడు గదా మీరు భగవద్గీతాసారమును గ్రహించితిరి" అని సాష్టాంగదండ ప్రణామ మాచరించి యింటికిఁ బోయెను

## 21 వ కథ.

రావణుఁడు సీతామహాదేవిని నెత్తుకునిపోయినపిదప రామలక్ష్మణులా దేవిని వెదకుటకై పోవుచుండఁగా మార్గమధ్యమున నామె పాఱవైచిన నగలమూఁట గాన్పించెను. వానిని లక్ష్మణున కిచ్చి నీవదినయొక్క నగలను గుర్తించఁగలవా యని శ్రీరామచంద్రుఁ డడిగెను. అప్పు డాసుగుణసంపన్నుఁడు వానిని బరికిలించి కాళ్లనగలమాత్రము దీసి "దేవా యివి మాతల్లివే అందులకు సందేహము లే" దని చెప్పెను. మిగిలిననగలను నేల గుర్తించవైతి వని శ్రీరామచంద్రు లడుగ "దేవా నే నాతల్లియొక్క పాదములు తప్ప పైభాగము నెన్నఁడును జూడ లే" దని జవాబు చెప్పెను.

## 22 వ కథ.

సత్యశీలుఁ డగుహరిశ్చంద్ర భూపాలుని బొంకించ వల

యునని ప్రతిజ్ఞగట్టి యెన్నియో యిడుములఁ బెట్టుచున్న విశ్వామిత్రమహర్షి యొకసమయంబున మిక్కిలియాగ్రహముతో వచ్చి హరిశ్చంద్రచక్రవర్తిని దనకాలితోఁ గిరీటము పైఁదన్నెను. అప్పు డాశాంతమూర్తి కన్నీరు గార్చుచు హే దేవా మృదువైనతమపాదపద్మములకు నాకిరీటమందలి కఠినమైనమణులు గ్రుచ్చుకుని యెంతబాధ నొందించెనో గదా యని పరితపించెను.

## 23 వ కథ.

ఒకకుక్క యెంగిలివిస్తర్లలోని యన్నమును దినుచుండ నున్నప్పుడనొకసాధు వాకుక్కను గౌగిలించుకొని అన్నా నాకును గొంచెమన్నముఁ బెట్టుమని చెప్పి యావిస్తరిలోని యన్నమును దానును భుజించి పోవుచుండెను. దీని నంతయుఁ జూచుచున్న శ్రీరామకృష్ణపరమహంసల వారు తనశిష్యుని నాసాధువువెంటఁ బోయి యాతఁడు చెప్పినది తెలుసుకొని రమ్మని పంపించెను. అంత నాతఁడు వెళ్లఁగా నీ వేల నావెంట వచ్చుచున్నావని సాధు వడి

గెను. శిష్యుడు “అయ్యా నాకు జ్ఞానోపదేశముం జేయుం”
డని వేడెను. అప్పుడా సాధువు మురికి తూములోనిబురద
నీరును గంగానదిలోని నిర్మలోదకమును, నొక్కటిగా కె
ప్పకుమోయనెను, మఱియువీణానాదమును, సంతయందలికల
కలధ్వనియు నీచెవులకు నొకటిగా నెప్పుడువినఁబడునోయ
ప్పుడు నీకుజ్ఞానసిద్ధి యైనట్లు తెలిసికొనుమని వెడలిపోయెను.

## 24 వ కథ.

మిక్కిలిహీనజాతియందుఁ బుట్టినయొకభక్తుఁడు రహస్య
ముగ దేవాలయముఁ జొచ్చియందలి దేవతావిగ్రహముపైన
మేయునినచ్చి యావిగ్రహమునకుఁ బాదపూజచేయుచు నతి
భక్తితో ధ్యానము సల్పుచుండ నర్చకులుదీనింజూచి
మిగుల నాగ్రహచిత్తులై వానింబంధించి న్యాయాధిపతి
చెంతకుఁబంపిరి. న్యాయాధిపతి విచారించి వీఁడుచేసినతప్పు
నకు శిక్షగానొకపాదమును ఖండించుఁడనియాజ్ఞనొసఁగెను.
అప్పుడామహాభక్తుఁడు “ఓతండ్రులారా! నాయందుఁగటా
క్షించి యాభగవంతునిదివ్యమంగళస్వరూపము మరియొక్క

సారెకన్నులారఁ జూడవిచ్చు యింకమోక్షగా రెండవపాదమునుగూడ ఖండించుఁ"డని ప్రార్థించెను.

## 25 వ కథ.

భగవంతుఁడు దుష్టజనసంహారమునకై నృసింహావతారము దాల్చిదానవేంద్రుఁడగుహిరణ్యకశిపునిసంహరించిముల్లోకములను గజగజ వణకింపఁజేయునట్టియు భూమ్యంతరిక్షములు నిండినయగ్నిజ్వాలలతో భయంకరముగా నున్నట్టియు రూపమునుజూచి బ్రహ్మాదిదేవతలుసహితము సమీపించుటకు భయమొందినవారలైయుండ భక్తాగ్రేసరుండగు ప్రహ్లాదుఁడు భగవంతుని యెదుట నంజలిబద్ధుఁడై గజగజవణకుచు నిలుచుండెను. అప్పుడాదయామయుఁడు తనప్రియభక్తునిఁ జూచి, "కుమారా, నాయాకారము నీకుభయముఁ గలిగించుచున్నదా" యనియడిగెను. అందులకాభక్తశిరోమణి "హేదేవాదిదేవా, దీనశరణ్యా, ఆనందస్వరూపుఁడవగు నీయాకారము నాకు భయమేలపుట్టించు"ననెను. అప్పుడాయుగ్రనృసింహుఁడు "అట్లైననీవు గజగజవణకుచుభయముఁ జెందియుం

ఒటకు గారణమే" మనియడిగెను. అంతలకు ప్రహ్లాదుడు "హే కరుణాసముద్రా, నన్ను సదా, నీదివ్యచరణారవిందము లందు నివసింపజేతువో లేక దుర్భరమగు రాజ్యభారమునకై సంసారసాగరంబునం బడద్రోయుచుంటివో యనిఖేదినొందుచున్నాననెను.

## 26 వ కథ.

పూర్వకాలమునం దొకనాఁడు ముగ్గురుమనుష్యులు విమానమెక్కి మోక్షమునకుఁ బోవుచుండిరి. అప్పుడొక గరుత్మంతుఁడొకసర్పమును నోటఁ గఱచుకొని యెగిరిపోవుట వారికంటఁ బడెను. అందులో నొకఁడు దానింజూచి "శాబాసు, ఆపక్షిరాజ మెంతమంచిపనిఁ జేయుచున్నది! విషపురుగును సంహరించి లోకమునకు నెంతమేలు చేయుచున్నదో చూచితిరా యని" అనెను. అట్లనినంతనే గిఱ్ఱ గిఱ్ఱ విమానమునుండి నరకములోనికిఁ గూలెను. రెండవవాఁడు "అయ్యో యెంతవిచారము, పాపము దిక్కులేని పాము నాపక్షి చంపుచున్నదే, జీవహింస జరుగుచుండఁ

కన్నులారఁజూచి యాఖకుండ వలసివచ్చెనదే, నేనేమి సేతును" అని జాలిపడినంతనే గభాలున స్వర్గములోఁబడెను. మూఁడవవాఁడు సుఖదుఃఖములును, రాగద్వేషములును మంచిచెడుగులును మొదలగుద్వంద్వములన్నియు మాయా స్వరూపములని తెలిసికొని చరాచరప్రపంచమంతయు బ్రహ్మస్వరూపముగాఁ గాంచుచు జ్ఞానమునుధరించి మోక్ష సామ్రాజ్యమును జేరెను.

## 27 వ కథ.

ఒకబ్రాహ్మణుఁ డొకరమణీయ మగుతోఁటను వేయించెను. ఒకనాఁడొకయావా తోటయందుఁ బ్రవేశించియా బ్రాహ్మణుఁడు మక్కువతోఁ బెంచుచున్న మామిడిచెట్లను బాడుచేసెను. అప్పుడా బ్రాహ్మణుఁడు మిగుల నాగ్రహముఁ జెంది నాయావును గఱ్ఱతో గొట్టి చంపెను. అంతలోఁ బురజనులందఱు చేరి యాబ్రాహ్మణుని రాక్షసకృత్యమునకు నిందింపసాగిరి. కాని యాబ్రాహ్మణుఁడు "ఓ పిచ్చివారలార నన్నేల నిందించెదరు? ఆయావును నేను జంపలేదు. సకల

కార్యములకుఁ గర్తయగు భగవంతుడే దీనిని జంపెను. అదోషమాయనదే కాని నాది కాదు. అని బూటకపు వేదాంతమును బోధించుచుండెను. సర్వాంతర్యామి యగు భగవంతుఁడు దీనినివిని యొకవృద్ధబ్రాహ్మణు వేషముఁ దాల్చి ఆ య్యాయితోఁట యెవరిదని యడిగెను. బ్రాహ్మణుఁడు "ఇది నాదే" అనెను. అంతవృద్ధుఁడు "ఆహా! ఇదియెంతరమణీయముగ నున్నది. ఈచెట్లనింతసొగసుగ నాటి పెంచినదెవ"రని యడిగెను. బ్రాహ్మణుఁడదికూడ నాపనియే యని చెప్పెను. అంతట వృద్ధుఁడు "ఆహా బ్రాహ్మణుఁడా యిదంతయు నీపనియేయైయుండ నీవుచేసినగోహత్యమాత్రము నాదెట్లగును? అదియునుగూడ నీదే" యని చెప్పి యదృశ్యుండయ్యె.

## 28 వ కథ.

వ్యాసమహాఋషి యొకనాఁడు చింతాక్రాంతుఁడై కూర్చునియుండ నారదులు వారింజూచి వారిదుఃఖమునకు గారణమడిగెను. అందులకు వ్యాసులు "ఓ నారదా, నేను భారతరామాయణాదిమహాగ్రంథములను రచించినను నాకు

హృదయశాంతి యింకనుగలుగలేదు. అందులకై కారణము విచారించుచున్నాను. నీకేమైనఁదోఁచినచో జెప్పఁగలవా" యనెను. అందులకు నారదులు "ఓ ఋషిపుంగవా, నీవు గ్రంథరచనయందే కాలముగడపితివి, గాని భగవత్సంకీర్తన చేయవైతివి. అదియే కారణముసుమా" యనెను.

## 29 వ కథ.

ఒకక్రీస్తుమతబోధకుఁడు వీధియందు జనులకుఁదనమతమును బోధించుచు "మీవిగ్రహమునొకకఱ్ఱతోఁ గొట్టినది యేమిచేయున"ని జనులనడిగెను. వారిలోనొకఁడునీదేవుని నేనుదిట్టిన వాఁడేమిచేయఁగలఁడని తిరిగిప్రశ్నింపనా క్రిస్తవుఁడు నీవుచచ్చినవెనుక దేవునిచేతశిక్షింప బడుదువనెను. అందులకుజనులుగా నాదేవుఁడుకూడ నీవుచచ్చిన వెనుకశిక్షించు ననెను.

## 30 వ కథ.

ఒకడాంబికుఁడు తన్ను మహాభక్తుఁడనియందఱు నను కొనవలయునని ప్రతిదినము దేవాలయమునకుఁబోయిదీర్ఘ

కాలము నందును నచటనే కన్నులు మూసుకొని జపమాలఁ ద్రిప్పుచుఁ గూర్చుండెను. ఇందుచేఁ బూజారికి దేవాలయము తలుపులు వేయుటకుఁ బ్రతిదినము నాలస్యమగుచుండ విసుకుఁ జెంది యొకనాఁడు మూలవిగ్రహముచాటునఁ గూర్చుండి "ఓ భక్తాగ్రేసరా, నీభక్తికి సంతసించితి. ఇదిగో యిప్పుడు నిన్ను నాయందైక్యము చేసుకొనుచున్నా"నని బిగ్గరగా ననెను. ఇది యాకపటభక్తుఁడు విని దేవుఁడు తన్నెక్కడ మ్రింగునో యని తిరిగి జూడక పాఱిపోయెను.

## 31 వ కథ.

మహాభక్తుఁడగు మహమ్మ దొకనాఁ డొంటరిగా నొకచెట్టు క్రిందఁ గూర్చుండెను. అప్పుడాతని శత్రువులలో నొకఁడగు 'డర్ తర్' అను వీరుఁడు ఖడ్గము చేతఁ బూని మహాత్ములవారి చెంతకు వచ్చి కత్తినిఁజాపు "ఓరీ నేఁటికిఁ గదా నీ వొంటరిగా నాచేతఁ జిక్కితివి. ఇప్పుడు నిన్ను రక్షించువార లెవరని బెదరించెను. అప్పుడా పరమభాగవతోత్తముఁడు కొంచమైనను జంకక యత్యంతశాంతముతో "ఓరీ పిచ్చివాఁడా? నేనొంట

రిగానున్నానని? యనుకొంటివా, సర్వజీవులకు రక్షకుఁడైన
పరమేశ్వరుఁడు లేనిచోటుగలదా? ఆయనే యిప్పుడునన్ను
రక్షింపఁగలఁడు" అనిపల్కి భగవధ్ధ్యాన పరాయణుఁడై
నిశ్చలముగఁ గూర్చుండెను. ఆయనశాంతచిత్తమును జూచి
నంతనే యాకాఠిన్యమనం బించుకమెత్తపడి తనచేతను
న్నఖడ్గమును జారవిడచెను. తక్షణమే యాభక్తుఁడాకత్తిని
దీసికొని గిఱ్ఱగిఱఁ ద్రిప్పుచు నిన్నిపుడెవరు కాపాడఁగలరని
"డర్ తర్'నుప్రశ్నించెను. అప్పుడాతఁడుమిగుల భయము
నొంది "అయ్యో, యిప్పుడీ యరణ్యమందు నాకుదిక్కెవరు
నన్నురక్షింపు"మని మహాత్ములవారిపాదములపైఁ బడెను.
అప్పుడాకరుణాసముద్రుఁడు "ఓరీబుద్ధిహీనుఁడా, యిప్పుడైన
నీకుజ్ఞానములేదా. నన్నేలప్రార్థించెదవు? రక్షకులకెల్లరక్ష
కుడగు నాపరమేశ్వరునిఁ బ్రార్థించు"మని హితోపదేశము
చేసివానిని దనశిష్యునిగాఁ జేసికొనెను.

## 32 వ కథ.

ఏసుక్రీస్తులవారిచెంత కొకఁడువచ్చి తనభార్యమిగులజ

బ్బగానున్నదనియూ నామెబాధ నివారణ చేయుమనియుఁ బ్రార్థించెను. అంతటనాభక్తుఁడు తనశిష్యునిపోయి యామె జబ్బుకుమర్పుమని యాజ్ఞాపించెను. కాని యాశిష్యుఁడెన్ని విధములఁ బ్రయత్నించినను నామెజబ్బునివారణ కాసందున మిక్కిలివిచారముతోడను నాశ్చర్యముతోడను దనగురువుల వారిచెంతకువచ్చి “స్వామీ యిదేమివింత! తామొక్కసారి భగవంతునినామ ముచ్చరించినతోడనే యెట్టివ్యాధియైనను నివృత్తియగుచున్నది. నేనెన్నిమారులు భగవన్నామ ముచ్చరించినను గొంచమైనను బ్రయోజనము కలుగలేదు” అనియడిగెను. అప్పుడామహా భక్తుఁడనునీను ఓరీ నీకింకనుభక్తి కలుగలేదు. భగవంతునియెడలఁ బూర్ణమైనభక్తివిశ్వాసమును గలవానికి నసాధ్యమైనకార్య మొకటికలదా” అనిచెప్పెను.

### ౮౩ వ కథ

ఒకబ్రహ్మజ్ఞానికిఁ గడుపుమీదఁ బెద్దపుండు లేచి యందుం డి పురుగులుతుట్టెలు తుట్టెలుగా క్రిందపైఁ బడుచుం

డెను. అప్పుడామహనుభావుండాపురుగుల నొక్కొక్కటి జాగ్రతతోఁదీసి తిరిగి వ్రణములోవేయుచుండెను. ఇదియొకఁడుచూచి "స్వామీ మీదేహము నేలయింతగా శ్రమపెట్టుచున్నా" రనియడిగెను. అందుకాపరిపూర్ణుఁడు చిఱునవ్వుతో "ఈబ్రహ్మాండమంతయు నాదేహముగానేనుచూచుచున్నయీదేహము మాత్రమేకాదు. కావున దీనిని పురుగుల కాహారముగా నిచ్చిన నాకేమికొఱంత" యనిప్రత్యుత్తరమిచ్చెను.

## 34 వ కథ.

ఋషిశ్రేష్ఠుండగు శ్రీశుకులవారు పరిపూర్ణవిరాగమును జెంది ఘోరారణ్యముల కేగుచుండెను. మార్గమధ్యమునఁ గొందఱుఋషికన్యలు వస్త్రవిహీనలై స్నానము చేయుచుండిరి. అత్తరి నీమహానుభావుం డాదారినేపోవుట సంభవించి దిగంబరులుగా నున్నయాకాంతలమధ్యనుండి పోవుచుండెను. వీనివెనువెంటనే యీయనతండ్రి యగువ్యాసమహర్షి హాకుమారా, హాపుత్రా అనివిలపించుచుఁ బఱు

కుచుండెను. ఋషికన్యకలు వీనినిజూచినంతనే వేవేగబట్ట లాధరింపసాగిరి. ఈవిపరీతము వ్యాసులవారు చూచి "ఓహో యిదేటివింత" పూర్ణయవ్వనముం దున్ననాకుమారుఁడుమీమధ్యనుండి వెళ్లినపు డావంతయైన సిగ్గులేక కాటికి గాళ్లుచాచుకొనిన నావంటి వృద్ధుమీచెంతకువచ్చినంతనే యింతసిగ్గేలకగ్గెనో తెలియకున్నదనెను. అందుల కాకాంతలు నవ్వుచు "ఓఋషిపుంగవా నీవుతపోవృద్ధుడవైనను మహాపండితుడవైనను నీకింకను విషయంబులే చావలేదు. నీపుత్త్రుడు నిష్కళంకుఁడు నిర్గుణుండు, నిర్మోహుండు లోకాతీతుఁడు. ఆమహానుభావుఁడు మామధ్యనుండి వెళ్లినను మమ్ములఁ జూచినయైననుండదు. మాయకు లోనైననీవంటివానిని జూడసిగ్గగుచున్నది. కాని మాయాతీతుండగు నీపుత్త్రునికడ మాకు సిగ్గేలయుండును?" అనిచెప్పనామునితన యజ్ఞానమునకు సిగ్గుపడికుమారుని మహావిరాగమునకు సంతసించి యింటికిఁబోయెను.

## ౪౫ వ కథ.

ఒకనాఁడు వేమనయోగి యొకఘోరారణ్యమందు నొక

హాస్తము తలక్రింద నుంచుకొని కఠినవేలపైఁ బరుండెను. అప్పుడిద్దరు ఋషికన్యలువచ్చి యామహానుభావునిఁజూచి అహా! ఈతని వైరాగ్యము శ్లాఘనీయమేగాని యింకనునీతని నొకటి విడువకున్నదిసుమీయని తమలోఁదామామాట్లాడుకొను చుండిరి. ఆయోగి దీనినివిని నతక్షణమే తనహస్తమును దల క్రిందనుంచితీసి వేసెను. అదియాకన్యకలుచూచి యయోగ్య నీతనినొకటే విడువకున్నదని యనుకొంటిమిగాని యితనికి నింకను రెండున్నవేయనెను. ఆవిరాగిదీనిని వినినంతనే యేమియుఁదోఁచక వారిపాదములపైబడి వారట్లనుటకుఁగా రణము తెల్పుమని వేఁడెను. అప్పుడాకన్యలిట్లుచెప్పిరి. ఓము నిశ్రేష్ఠా! నీవుప్రపంచమంతయు విడిచితివిగాని యింకను గొంచముసుఖము నపేక్షించి తలక్రిందఁ జేయిపెట్టుకొని పరుంటివి. ఈకొఱఁతయొక్కటియున్నదని మేమనినంతనే చేయితీసితివి కావున నభిమానముకూడాయింకను బూర్ణముగా వశించలేదని నిన్నుని-కను రెండువిడువలేదనియం టిమి యని''జవాబుచెప్పి వెడలిపోయిరి.

## 36 వ కథ.

భగవన్నామసంకీర్తనము పాడుచున్నయొకభక్తునిచెంతకు నొకఁడుపోయి "అయ్యా భగవంతుని వర్ణింపు" మని ప్రార్థించెను. వెంటనే యాభక్తుఁడు మౌనముదాల్చెను. అప్పు డాతఁడు స్వామీ యిదేమి! భగవంతుని వర్ణించుమని యడిగినతోడనే యదివఱకుఁ బాడుచున్నవాఁడు సహితమూరకొని మౌనముదాల్చితివే!" అనియడుగ నాభక్తుఁడు "అయ్యా వర్ణనాతీతం బగుదానిని వర్ణింపుమంటిరే" యనిజవాబుఁ జెప్పెను.

## 37 వ కథ.

ఒకచాకలివాఁడు గలఁడు. వాఁడు నిష్కళంకమైనభక్తిగలవాఁడు. ఒకనాఁడు నిద్రించుచు మంచికలఁగాంచుచుండఁగా వాతని నెవరో లేపిరి. అంతనాతఁడు మిగులవిసుకుఁజెంది "అయ్యో నన్నెందుకు లేపితిరి? చక్రవర్తిగానుండి ప్రపంచ మంతయుఁ బాలించుచుంటిని. అష్టభోగములనను భవించుచుంటిని. భార్యాపుత్రాదులతో బంగరుతూఁగుటు

య్యలలోనూఁగుచుంటివి. ఇట్టిమహద్వరము భంగముచేసితివిగ
దాయని నిట్టూర్పులు విడచెను. అప్పుడామనుజుఁడు "ఓపి
చ్చివాఁడా నీవనుభవించుచుండిన దంతయు సత్యమనుకొం
టివా? అదికలయేగావ చింతించకు" మనెను. అప్పుడాభక్తుఁ
డు" ఓరీ! పిచ్చివాఁడవు నీవుకాని నేనుగాను. నాకలయెం
తయసత్యమో నేనుజాఁకలిగానుండుటయు నంతఅసత్యమే.
అదియెంతసత్యమో యిదియు నంతసత్యమే: నీవజ్ఞానివై
యీప్రపంచమంతయు సత్యమేయని భ్రమించుచున్నావు
గానియిదియును వట్టికలయేసుమా" యనెను.

## ౪౪ వ కథ.

శ్రీరామకృష్ణపరమహంసలవారు రోగపీడితులై యున్న
తరి శశిధరుఁ డనునొక పండితుఁడు వారిసన్నిధికి వచ్చి
"స్వామీ మీమనస్సునొక్క క్షణము మీశరీరముపై గురిపె
ట్టినయెడల మీవ్యాధినిమిషములో హరించిపోవునుగదా?
అని చెప్పెను. అప్పుడాభక్తాగ్రేసరుండు "శ్రీమన్నారా
యణుని పాదారవిందములకు సమర్పించిననామనస్సు నీకు

చ్ఛదేహముపైఁ దిత్తిగిరియెట్లు పెట్టుదును" అనిజవాబుచె
ప్పెను. అప్పుడాపండితులవారు "అట్లైనమీవ్యాక్తిని గుదు
ర్చుమని మీజగన్నాథునకైన వేఁడుకొనరాదా" అనితిరిగియడి
గెను. అందులకాపరమహంస "అయ్యా సచ్చిదానందస్వ
రూపిణి యగుజగన్నాథుని దలఁచినంతనే నాదేహము నేమఱ
చుచుంటినిగాన నీశరీరమునిమిషమైన మాతల్లిని వేఁడుకోరు
టకు వీలుపడ" దని జవాబుచెప్పెను.

## 39 వ కథ.

ఒకదొంగ రాజుగారియింటికిఁగన్నము వేసెను. అప్పుడు
రాజును భార్యయును మాటలాడుచుండుటచే నాకన్నములో
నేయుండి వారిమాటలు వినుచుండెను. రాజుభార్య నాథా
మనపుత్రికను నింతవఱకుఁ దగినవరుఁడు రాఁడయ్యె, నేమిసే
తుమని, విచారించెను. అప్పుడురాజు "ఓప్రాణనాయకీ" చిం
తించవలదు. ఇంతవరకు నేనెంతయూ విచారించితిని గాని
సుగుణసంపన్నుఁడగురాకొమరుఁడొక్కఁడును గానరాఁడ
య్యె, భాగ్యవంతుఁడైనను బుద్ధిహీనునకిచ్చినదానికంటె

ధనములేకుండినను సుగుణవంతుఁడైన దరిద్రునకిచ్చినదే మేలు
గావ రేపటిరోజున మనపురమంతయు వెదకించి యెవఁడైననొ
కభక్తుని రావించి వానికి మనపుత్త్రిక నిచ్చి వివాహముచేసి
వానికి సగమురాజ్యము నిచ్చెదను" అని యాదంపతులను
కొను నామాటలాదొంగవిని మిగులనానందభరితుఁడై యాక
న్నమునుండి మఱలియింటికిఁబోయి యుదయమున నే చక్క
గ స్నానముఁజేసి మహాభక్తునివలె వేషముధరించి యొకతం
బుర కేఁబూని నారాయణస్మరణఁ జేయుచు రాజగృహము
చెంతనుండి పోవుచుండెను. భక్తునికై వెదకుచున్నయా
రాజు మిగులనానందించి వానిని దగుసన్మానముతో నింటికి
రప్పించి నవరత్నఖచితసింహాసనంబుపైఁ గూర్చుండబెట్టి తన
ముద్దులపుత్త్రికను స్వీకరించుమని ప్రార్థించెను. అప్పుడా
దొంగ అహా! యేమివింత, యేమియాశ్చర్యము, దొంగభక్తి
కేయిట్టి మహాపదవి దొరకుచుండగ, నిజమైనభక్తిగలిగిన
యెడల నెంతమహాభాగ్యము లభించునో గదా, యనితలం
చుచు నిజమైనభక్తివైరాగ్యములు గలిగినవాఁడై సింహాసన

మునుండిదిగి నారాయణస్మరణఁ జేయుచు, రాజుసమర్పించిన రాజ్యమును బుత్రికనుగూడ విసర్జించి తపంబునకై పోయెను.

## 40 వ కథ.

శాంతపమణి యనురాజు నిరంతరము స్త్రీలోలుఁడై యింద్రియసుఖానుభవమునందే కాలము పుచ్చుచుండెను. ఒక్కనాఁడీరాజు మధురమగుఫలములను భుజించి తోళ్లను గిటిగీగుండ నావలఁ బాఱవేయుచుండెను. అట్టిసమయమున సన్యస్తుఁడగు 'బనుగను' మహాజ్ఞాని ప్రమాదవశమునఁ గోటలోనికిఁబోయి యాతోళ్లను దినుచుండెను. రాజుదానిని జూచి "ఈదురాత్ముఁడిక్కడికెట్లు వచ్చెను? వీనిని బాగుగ మర్దించుఁ" డనిభటుల కాజ్ఞాపించెను. భటులు రాజాజ్ఞ ప్రకారము వానిని గొట్టుచుండిరి గాని యాజ్ఞాని యేడ్చుటకుబదులు నవ్వుచుండెను. అదిరాజు చూచి యాశ్చర్యపడి యోరిమూర్ఖా నీవు శోకించుటకు బదులు నవ్వుచుంటివేల? కారణముఁ జెప్పుమనెను. అప్పుడాబ్రహ్మవేత్త తిరిగి నవ్వి

"ఓరాజా పాపవైచిః పండ్లతోళ్లను భుజించునాకీశిక్షను విధించఁగాఁ, బండ్లనుభుజించు నీకెట్టిశిక్షను భగవంతుఁడు విధించునోయనియు, రాజగృహమునకు వెలుపల వర్తించు నాకీశిక్షను విధించఁగా నంతఃపురాంతర్వర్తి వగునిన్నీశ్వరుఁడేమి శిక్షించునో యనియు, నేకాకియగు నన్నిట్లు శిక్షించఁ బెక్కుస్త్రీలతోడఁ గ్రీడించునిన్నెట్లు లోకేశుఁడు శిక్షించునో యనియుఁ, బరులకుఁ గీడుచేయని నాకిట్లు క్రూరదండనను విధించఁగా పాపరాత్మివగునీకెట్టి క్రూరదండన జగదీశ్వరుఁడు విధించునో యనియు నింద్రియనిగ్రహముఁజేసి భగవద్భక్తుఁడ నగునన్నిట్లు శిక్షించగా నింద్రియకింకరుండవయి భగవద్విముఖుఁడ వగునిన్నెట్లు శిక్షించునో యనియు నవ్వితి" ననిజవాబు చెప్పెను.

## 41 వ కథ.

లాహోరునం దవతరించిన శ్రీరామతీర్థస్వాముల వారి నొకనాఁడు భార్యసమీపించిన "నాథా, నే నెవరినైనది. మీకుజ్ఞాపక మున్నదా" యని యడిగెను. అప్పుడా మహా

పురుషుడు "లేదు జ్ఞాపక మనుమాటయే లేదు. నేను జ్ఞాపక ముంచుకొనుటకు నీవు నాకన్యముగా నుండినఁ గదా? బ్రహ్మాండ మంతయు నేనైయుండ నేను జ్ఞాపక ముంచు కొనుటకు నాకన్యమేమికలదని" జవాబు చెప్పెను.

## 42 వ కధ.

ఒకనాఁడు శ్రీదయానందసరస్వతీ స్వాములవారిని "స్వామీ మీమనస్సున కెప్పుడు నింద్రియవికారములు గలుగ లేదా యని" నొకఁడడిగెను. అందుల కాపుణ్యశీలుఁడు "అహర్నిశములు పరమార్థప్రబంధములయందును, జింతనయందును నామనస్సు మునిఁగి యుండుటచే వేఱుచింతలు కలుగుటకు నావకాశమే లేకపోయెను." అనిజవాబు చెప్పెను

## 43 వ కధ

'సోక్రటీసు' అనుతత్వవేత్త మరణమునొందు తఱి నొకానొకఁడు "మీరు మృత్యువున కణుమాత్రమైనను భయముఁ జెందకుండుటకుఁ గలకారణ మే" మని యడిగెను. అందుల కామహాపురుషుఁడు నవ్వుచు, "నాకు భయము లేక

పోవుటమాత్రమే కాక పరమానందమును గూడ నొందుచు న్నాను. ఏలయన నీతుచ్ఛదేహమునుండి నేఁడు నేను విముక్తి నొందుచున్నాను. నేనాత్మనుగాని శరీరముగాదు. నాకెన్నఁడును మృత్యువులేదు, ఈశరీరబంధన నాకు నేఁటి తో విడిపోవుచున్నది గదా యని మహదానందము గలుగు చున్నదని" జవాబు చెప్పెను.

## 46 వ కథ.

ఒకశిష్యుఁడు తనగురుస్వామిచెంతకుఁ జని స్వామీ, నాదినములగల కాలమంతయు నాపూర్వపుస్నేహితులు తరు చుగా వచ్చుచుండుటచే వృథాయగుచున్నది. యేకాంత మున ధ్యాననిష్ఠలు జరుపుకొనుటకు సావకాశమే లేకున్నది. అందుల కేదైన నుపాయముఁ జెప్పుఁడనియడుగ "ఓశిష్యా, నీస్నేహితులలోఁ బేదవారుగా నున్నవారికి నప్పియ్యుము. ధనికులుగా నున్నవారి నప్పడుగుము. ఇట్లుచేసితివేని నీస్నేహితులందఱు మాయమై నీకుఁదప్పక యేకాంతములభించు" ననెను.

## 45 వ కథ.

శ్రీరంగావధూతలవారి నొకనాఁ డమ్మహనీయుని మేనయత్త "ఓరీ నీ వెప్పుడు పిచ్చిపట్టినవానివలె నూరక కూర్చుండ నేల, లే లెమ్ము, పనిపాటలు చేసుకొనుమని" కఱ్ఱతో వీపుపై మోదెను. అప్పు డాశాంతమూర్తి చిఱునవ్వు నవ్వి "తల్లీ నీకట్టెకుఁ దిరిగిజవాబు చెప్పెడికట్టె దచ్చినదిసుమా" యనెను.

## 46 వ కథ.

శ్రీరామతీర్థస్వాములవారు బాల్యదశలో నుండుకాల మందొకనాఁడు పుస్తక మొకదానిని జదువుచు వీథిలో నడచుచుండెను. అప్పు డొక పెద్దమనిషి యాతనిం జూచి "ఓవెఱ్ఱివాఁడా పుస్తకమును మూసి పాఠశాలకుఁ బోయి చదువుకొనుము. వీథిలోఁ జదువుచుఁ బోయెద వేల యని" యనెను. అందుల కాబాలుఁడు "అయ్యా! ఈప్రపంచ మంతయు నాకుఁ బాఠశాలయే" యనిజవాబుచెప్పెను.

## 47 వ కథ.

ఒకనాఁడు శ్రీరామకృష్ణపరమహంసలవారిచెంత కొక డాక్టర్ పోయి "ఏమయ్యా మీవిలువగలకాలము నంతయు నిట్లు పిచ్చిపట్టినవానివలె వృథాపుచ్చుచున్నార"ని యడిగెను. అప్పుడాభక్తాగ్రేసరుండిట్లు జవాబు చెప్పెను. ఈప్రపంచమందుఁ బిచ్చివారు కానివారెవరు? ఈప్రపంచమే యొకపిచ్చి యాస్పత్రి: ఇందుండు వారందరును బిచ్చి వారలే. కొందరుధనము కొఱకును, కొందరుకీర్తి కొఱకును గొందరు స్త్రీలకొఱకును, గొందరు నైశ్వర్యము కొఱకును నిట్లనేకవిధములగుపిచ్చులచేఁ గాలమంతయువృథాపుచ్చు చున్నారు. నాయనా? నాకీపిచ్చులేవియుఁ బట్టక దేవుని విషయమైన పిచ్చిపట్టినది. నీచేతనైనచోఁ దగినమందిచ్చి బాగుచేసి పుణ్యము గట్టుకొనుము, యనెను.

## 48 వ కథ.

పిచ్చివానివలె నున్నయొకజ్ఞానిసన్నిధి కొకనవనాగరి కుఁడు పోయివానిని హేళనచేయుటకై "అయ్యా! ఈలో

కమందు బిచ్చివాఁడెవ్వఁడనియడిగెను. అందుల కామహానుభావుఁడిట్లుజవాబుచెప్పెను. “రక్తము, మాంసము, చీము మొదలగువాటితో నిండివేలకొలఁదిపురుగులతోఁగూడి, మలమూత్రముల కునికిపట్టై, పేగులు నరములు నెముకలుం గలిగి పచ్చితోలుతోఁ గప్పఁబడి సదాదుర్గంధమునే ప్రసరింపఁజేయుప్రణమువంటి యిట్టిదేహమును సుందరమైనదని భ్రమించి, దానిని మోహించు వానికంటెఁ బిచ్చివాఁడొకఁడుండునా?” యని జవాబు జెప్పెను. ఆనవనాగరికుఁడు సిగ్గుపడి మఱలఁ బ్రశ్నింపకయే ఇంటికిఁ బోయెను.

## 49 వ కథ.

మచిలీపురమునం దవతరించిన శ్రీరంగావధూతలవారిని బాల్యమునందొకనాఁడు వారితండ్రి కొన్నిఫలములు గొని తెచ్చుటకై బజారునకుఁ బంపిరి. అంతటవారు వీధివెంబడిఁ బోవుచుండగాఁ గొందఱాకలిచేఁ బరితపించుభిక్షుకు లెదురుపడిరి. తోడనేయాదయామయునికి మిక్కుటిలిదయగలిగి చేతనున్నడబ్బంతయు నాబీదలకిచ్చి “తండ్రులారా, యేదైనఁ

గొనితిని. నీకున్న వ్యాధను దీర్చుకొనుము'' డని చెప్పి యుత్తమచేతులతో నింటికిఁ బోయి తండ్రియొద్దనిలచెను. అప్పుడు వారి తండ్రి పండ్లు దెచ్చితివాయని యడుగ వాభక్తాగ్రేసరుఁడు "నాయనా తెచ్చితి'' ననెను. అంతట వానితండ్రి యిటులెన్నని చేయిసాచ "నాయనా, అశాశ్వతమైనట్టియు క్షణకాలమాత్రమే సుఖమునిచ్చునట్టియు పండ్లకుబదులు శాశ్వతసుఖమునిచ్చు సుకృతఫలమును గొనితెచ్చితి'' నని తానుచేసిన కార్యమును వినయపూర్వకముగా విన్నవించెను. తండ్రియాబాలుని ముద్దుపల్కుల కచ్చెరవునొంది సంతోషించెను.

## 50 వ కథ.

నీచకులంబునఁ బుట్టినగుహుఁడు మహానుభావుండగు శ్రీరామచంద్రుని "ఓరీ రామా'' యనిపిలిచెను. అంతటలక్ష్మణుఁడు మిగుల నాగ్రహముఁజెంది వానిని జంపఁబోయెను అప్పుడాపరమపావనుఁ డిట్లనియె "ఓయీ, లక్ష్మణా, నీవు ప్రాణములను దీయఁబోవువాఁడు నాకుబరమమిత్రుఁడు

సుడూ! నన్నుఁ బ్రేమవలన నోరీయనిపిలచెను. అట్లుపిలుచు వాని నేనుమిక్కిలి ప్రేమింతును. ఛండాలుఁడైనను భక్తిగల వాడైనయెడల వానినిదరిఁ జేర్తును" గాని భక్తిశూన్యుఁడైన యెడల వాఁడు బ్రాహ్మణుఁడైనను వానిదరిఁ చేర్పను. భక్తుఁడు విషమిచ్చినను త్రాగుదును గాని భక్తిలేనివాడమృతము నిచ్చినను స్వీకరింపనని యుపదేశించెను.

## ౫1 వ కథ.

ఒకానొకసమయమున్నఁ కలిదేవత పరీక్షున్మహారాజు రాజ్యమునందుఁ బ్రవేశింపఁ జూచెను. గాని పరమపావనుఁడగు నారాజు "ఓకలీ నీవు నారాజ్యమునం దుండుటకు స్థలములేదు. నా రాజ్యము చెంతకు రాఁగూడదని" భయపెట్టెను. అప్పుడు కలిమిక్కిలి దీనుఁడై "ఓమహారాజా అట్లైన నేనుం డుటకుఁ దావుఁ జూపుమని" ప్రార్థించెను. ఆమాటలకుఁ పరీక్షిత్తిట్లనియె. "ఓకలీ నీవునివసించుటకు నాల్గుస్థలములను జూపుచున్నాను. జూదము, మద్యపానము, పరస్త్రీసంగమము, జీవహింస, యనునీనాల్గుకార్యము లెచ్చటె

చ్చట జరుగుచుండునో యచ్చటచ్చట నీవు స్వేచ్ఛగా విహరించుచుండుమనెను అంతటఁ గలి "ఓమహారాజా, నాలుగుస్థలములయందు నివసించుట మిగులకష్టతరము. యీనాలుగువిధదోషములు గలయొక శ్రేష్ఠస్థానమును నిర్దేశింపుఁడని యరుగఁ బ్రార్థించెను. అప్పుడామహారాజు "ఓకలీ. ధనమెచ్చట నుండునో యచటనీవుండుము. ఈనాలుగుదోషములకునికిపట్టైనస్థానము ధనమేకనుక నచట నీయిష్టానుసారముగా నుండవచ్చునని" చెప్పెను.

## 52 వ కథ.

ధనవంతుఁడైననొకమార్వాడీ తనయైశ్వర్యము నెల్ల విసర్జించి శ్రీరామకృష్ణపరమహంసలవారి చెంతకుఁబోయి "స్వామీ, నేనుసర్వసంగపరిత్యాగముఁ జేసినను భగవంతుఁడు గాన్పించలేదు. కారణమేమని" యడిగెను. అప్పుడా పరమహంస "పాత్రలోనున్న తైలమును బాఱబోసినను పాత్రయందింకను దానివాసన యంటియుండును, అట్లే నీవుసర్వవిషయములను విడచినను నీమనస్సునందు వానివా

సన యింకను నంటియున్నది. అదిపోడనశించినఁగాని నీకు భగవంతుఁడు గాన్పించఁడని" చెప్పెను.

## 53 వ కథ.

శ్రీకృష్ణభగవానుఁడు లోకనాథుఁడు పతివ్రతాశిరోమణియగు కుంతీదేవిని "నీకు యేమివరములు కావలయునని" యడిగెను. అప్పుడా భక్తాగ్రేసరిణి "దేవా నాకెల్లప్పుడును కష్టములే గలుగునట్టుల వరముఁ బ్రసాదించుమని" కోరెను. శ్రీకృష్ణులవారట్టి విపరీతపుఁ గోర్కెకు నచ్చెరువునొంది యందులకుఁ గారణంబడిగెను. అప్పుడా పుణ్యశీల "హేదేవా? మనుజులు పూర్ణమైన సౌఖ్యైశ్వర్యములతో నుండి ప్రాపంచక సుఖాభిరతులై యున్నపుడు మదాంధులై కన్నులు దెలియక ప్రపంచకతుచ్ఛభోగములే శాశ్వతమని తమ్ము నిత్యానంద స్వరూపుఁడవగు నిన్ను సహితము మరచుచున్నారు. అరిగి కష్టములు కలిగినతోడనే బుద్ధితెచ్చుకొని శ్రీమన్నారాయణుఁడే నాకుదిక్కు సర్వలోకములకు నాయకుఁడని సదా నిన్ను ధ్యానించుచుందురు. కావున హే దీనబంధూ! ఎప్పుడును నీపాదా

రవిందములు మరవకుండుటకై కష్టములనే కోరితినని సమా

ధానము చెప్పెను.

## 54 వ కథ.

జగత్ప్రఖ్యాతుండును, బ్రహ్మసమాజమునోద్ధారకుండును. భక్తాగ్రేసరుండు నగు శ్రీ కేశవచంద్రసేనులవా రొకనాఁడు తానుధరించిన దివ్యవస్త్రములనన్నిటినొకమూలఁ బార వైచి జుట్టుగొరిగించుకొని కౌపీనముధరించి మట్టిమూకుడొకటిచేతఁబట్టివీథిలోఁ బిచ్చమెత్తగా లభించినబియ్యమును నొకమట్టిపాత్రలో నొకబహిరంగస్థలమునవండి యన్నమును నేలపైఁబడవైచి యాయన్నమును దినుచుండెను. అప్పుడామహానుభావునితల్లి కుమారుని పిచ్చిచేష్టలకు ఖిన్నురాలై "నాయనా నేడు నీవేలయిట్టి పిచ్చిపనులుచేయుచున్నా" వనియడిగెను. అప్పుడాసుగుణసంపన్నుఁడు "ఓతల్లీ, స్వచ్ఛమై, నిష్కళంకమైననామనస్సునందు దుష్టసంకల్పమొకటికలిగినది. దానికిఁ బ్రాయశ్చిత్తముగా నీకార్యముఁ జేసితినని" చెప్పెను.

## ౫౫ వ కథ.

ముద్దులు గులుకునొక చిన్నపక్షి యొకవృక్షముపైఁ గూర్చుండి మధురమగుతనకంఠధ్వనిచే వీనులవిందుగఁ బాడుచుండఁగా నొకకిరాతుఁడు దానినొక యంబుతోఁ గొట్టి చంపెను. దీనిం జూచినయొకభక్తుఁడు మిగులఖిన్నుఁడై "ఓనిర్దయుఁడా అయ్యో, అదినీకేమియపకారముఁ జేసినది? దానిం గొట్టుటకు నీకుచేతు లెట్లొచ్చినవి? దానియాటలు దాని పాటలు చూచిననీకానందముగలుగ లేదా" యనియడిగెను. అందులకాదుష్టుఁడు "అయ్యా, మీరు దానియాటలు, పాటలు మాత్రమే చూచి యానందింతురు. నేను దానిం జంపి భక్షించి కూడ నానందింతు"ననెను. అంతభక్తుఁడు "దీనిం జంపిభక్షించి యానందింతునంటివిగాని రేపు దండధరుండగుయముడుచండతరంబగు గదాదండంబుచే నుగ్రుండై నిన్నుమర్దించుచుండ నీవు పొందుయానందమును దలపవైతివి కదా?" యని వానికి బుద్ధిచెప్పి నాటనుండి వానిని జీవహింసనుండి మఱల్చెను.

## ౫౬ వ కథ.

ఒకనాడు అక్బర్ చక్రవర్తి వేటకైయడవికిఁ బోగా నచట నొకఋషినిగాంచి వానితో ముచ్చటించి వానియ ద్భుతజ్ఞానమునకు సంతసించి వానిదరిద్రమును జూచిమిక్కిలిజాలిపడి యిట్లనియె "ఓపండితోత్తమా, నీ విట్టిదౌర్భాగ్యదశయందుండుటఁ జూచి నాకు నీమీఁద గనికరము పుట్టినది. నాపట్టణమందు నీ కొకమంచిభవన మిచ్చెదను. అందుసుఖముగా నుండుము" మనెను. అందులకాఋషి చిఱునవ్వు నవ్వి "రాజా, యీమనోహరమైన యరణ్యములకంటెను నిందుండుకొండగుహలకంటెను నీపట్టణములుగాని, నీభవనములు గాని సుఖప్రదములుకావు. ఇట్టిసుఖమును విడిచి నీపట్టణమందేల యుండవలె"ననెను. ఆచక్రవర్తి "అగ్యా అట్లైనయీపట్టు వస్త్రములనైన ధరించు"డని వేడెను. ఋషి "రాజా నాకీసహజంబగు చర్మవస్త్రముండఁగా తిఱిగి దీనిపై మఱియొకవస్త్రమేల చుట్టవలె"ననెను. అంతట రాజు "స్వామీ మీరు నిద్రపోవుటకై బంగారుపా

త్రము నైనదీసుకొను" డని ప్రార్థించెను. ఋషి "రాజా నీవు ద్రావుటకీ దోసిలి చాలదా మఱియొక పాత్రతో నవసరం బేమి" యనెను. అంత రాజు "ఓ మునిశ్రేష్ఠా మీరు శయనించుటకీ మెత్తని పరుపు స్వీకరించుఁడని ప్రార్థించెను. ఋషి "ఓ రాజా, పట్టువలెనున్న యీ మెత్తని పచ్చికయుండ మఱియొక పరుపు నాకేల" యనెను. "అట్లైన నో ఋషోత్తమా, మీరనుదినము భుజించుటకీ సామాగ్రి నైనఁ దీసికొనుఁడ" ని వేఁడెను. ఋషి "రాజా, నాకీయరణ్యమందనేక ఫలములుండగా నాకివి యేల" యనెను. ఈ మహానుభావుని త్రిజ్ఞాన వైరాగ్యములకు రాజు మిగుల నాశ్చర్యముఁ జెంది "అహా! యితండుగదా నిజముగ సంతుష్టాంతరంగుఁడ" ని తలంచుచు నింటికిఁ బోయెను.

## 57 వ కథ.

అగ్బర్ చక్రవర్తి మఱియొకనాఁ డీ ఋష్యాశ్రమమునకు వచ్చి యామునిం జూచి "ఓ ఋషోత్తమా మీరు నిజముగ సర్వసంతుష్టులు; ఐనను నన్నుం గృతార్థుని జేయుటకై

నాగృహంబునకు విచ్చేసి నేనిచ్చుబహుమానములఁ గ్రహించుఁడని వేడెను. ఆతపసి యందులకు సమ్మతించి వానివెంటఁబోయెను. రాజగృహమును జేరినంతనే చక్రవర్తి యాతపసిని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి తాను భగవంతుని నిట్లు ప్రార్థించుచుండెను. ఓదేవా నీకరుణచే నాకీమహారాజ్యభోగము కలిగినది. నీకనేకవందనములు. నాయందింకను బరిపూర్ణానుగ్రహముగలవాఁడవై నారాజ్యము విస్తరింపఁజేయుము, నాధనమును వృద్ధిజేయుము, నాబిడ్డలను దీవించుము, నాకింక నింద్రభోగముల నొసంగుము" అని ప్రార్థించుచుండ నామునిశ్రేష్ఠుండువిని మెల్లనలేచి వెడలిపోవుచుండెను. అప్పుడురాజు „ఓస్వామీయిదిగో బహుమానములను దీసుకొనివచ్చుచున్నాను. దయచేసి స్వీకరించుఁడని ప్రార్థింపఁగా, నావిరాగి „భిక్షుకుఁడు నాకేమి బహుమానము నీయఁగలఁడు! నీవు రాజువనుకొంటిని ఇంతవరకు నీవు భిక్షమెత్తుచుండుట చూచితిని. నీవంటి దరిద్రునిబహుమానము నేనొల్లనని చెప్పి తిరిగిపోయెను.

## 53 వ కథ.

అలగ్జాండరను మహావీరుఁడు దేశదేశంబుల ననివారిత శౌర్యంబున వశంబు చేసికొని, హిందూదేశముకూడ జయించి తిరిగితనదేశమునకుఁ బోవుచుండఁగా సింధునదీ ప్రాంతమందు నివసించుచున్నయొక తాపసి వారికంటఁబడెను. ఆమహాసీయుఁడు మలమలమాడుచున్న యెండయందు నిసుకలో దిగంబరిగాఁ గూర్చుండియుండెను. ఆరాజు నవరత్నఖచితమగు కిరీటమును వాల్చి, నగద్ధగాయమానంబగు భూషణములధరించి, గోచిపాతసైనను లేని యాతపోధనుని బారఁజూచెను. బాహ్యమున కామహాసీయుఁడెంత దరిద్రుడుగాఁ గాన్పించినను వానిముఖము, మహదానందమును బ్రహ్మతేజమును గలిగియుండుటచేనాచక్రవర్తి వానింజూచినంతనే వానిపైమక్కువగలిగి తనతో దనపట్టణమునకు రమ్మనియాజ్ఞాపించెను. అంతనాతపసినవ్వి ఓరాజా, నన్నునీపట్టణమునకు గమ్మంటివి. ఈప్రపంచమంతయు నాయందేయున్నది. ప్రపంచము నన్నుఁబట్టజాలదు.

ప్రపంచమన నేల? ఈబ్రహ్మాండమంతయు నాయందేయు న్నది. బ్రహ్మాండమునకుహితము నన్నుఁబట్టజాలదు. సూర్యచంద్రాదు లుదయించుటయు నస్తమించుటయుఁ గూడనా యందే" యనిచెప్ప నాచక్రవర్తి యిట్టివాక్యముల నెన్నడు వినియుండకపోవుటచే మిగుల నాశ్చర్యముఁజెంది యిట్లుచెప్పెను "నీకుఁగావలసినంతధనమిచ్చెదను. ప్రపంచభోగము లలో నిమ్ము ముంచెదను. దేవతాస్త్రీలను ధిక్కరించునప్స రసలను నీకుఁబరిచారకులుగఁ జేసెదను. నీవు నైననాతోడ రమ్మ" నెను. ఈమాటలకా జ్ఞాని తిరిగినవ్వి "ఈప్రపంచ మునొక్క సౌభాగ్యమునకంతకు నేనే కారణము. సూర్య చంద్రాదులు నాప్రకాశముచేతనే ప్రకాశించుచున్నారు. సృష్టిలోఁ గలసమస్తవస్తువులకు సుఖమును, సౌందర్యమును నావల్ల నేకలుగుచుండ నీవేమినాకీయఁగలవు" అనిచెప్పెను. ఈమాటలకు రాజుగ్రుఁడైతనకత్తిని బైకెత్తి "నీశిరస్సును ఖండించెద" నని బెదరించెను. అప్పుడాజ్ఞాని తిరిగిపకపకనవ్వి "రాజా నీజన్మమధ్యమం దిట్టియనృత మెప్పుడాడియుండవు.

పుట్టుచావులులేనినన్ను నీవుచంపుటెట్లు. నేనెండకు నెండను, వానకుఁదడియను, నగ్నిచేఁగాల్పఁబడను, ఖడ్గముచేఁ దెగఁబడను. ఇప్పుడు ఖడ్గమునీవు పైకెత్తుటకుఁ గలశక్తియు నాదేసుమాయని గంభీరముగఁ బల్కినంతనే యారాజు నిస్పృహుండై నిశ్చేష్టితుండై, ఖడ్గమును భూమిపైజారవిడచెను. తిరిగికొంతతడవు కారాజుస్పృహదెచ్చుకొని "ఓ తాపసీ, నాశక్తిసామర్థ్యములు దెలియక నీవిట్లుపల్కుచున్నావు. ఈభూమండలమునఁ గలసమస్త రాజ్యములను జయించి ప్రపంచమంతయు నేకచక్రముగా నేలుచున్ననీ రాజేశ్వరుండ నగుటనెఱుంగ" వనెను. ఋషియీమాటలు వినినంతనే తిరిగి పకపకనవ్వి "ఓరాజా గర్వించకుము, నీవు జయించనట్టియు, నీకసాధ్యమైనట్టియు, మఱియొకప్రదేశముగలదు. అందుండెడి భాగ్య మసమానము. సౌఖ్యమో నిరుపమానము" అనెను. అంతట నారాజు మిగులనాతురతతో "అహా నేను జయించనట్టిరాజ్యము నలుదిశలయందెచట నెదకినను గన్పించలేదు. అంతియేగాక అది నాకసాధ్యమనికూడ

జల్కితివి, ఏమిఁ విపరీతము! ఓఋషోత్తమా తత్కారణమేదానిం
జెప్పు" మనియడిగెను. అప్పుడామునిపుంగవుఁడు "ఓరాజా
అదినీకుసాధ్యముకాదు, అచటమిక్కిలిపరాక్రమవంతు లగు
నాలుగురుశూరులు కావలికాచుచుందురు. వారినిజయిం
చినఁ గాని నీవారాజ్యముచెంతకుఁ బోఁ జాలవు, అర్ధ
రన నేల అందొక్కనికైన నీవు జయింపఁ జాలవు సుమా!
ఒకవేళ నీయదృష్టమున వారిం గెలిచినచో వారిసేనానా
యకుం డగునొకమహాశూరుఁ డారాజ్యముచుట్టును దిరుగు
చుండును యెట్టిపరాక్రమవంతులైనను వాఁడు భస్మీకృతము
చేయును ఇట్టికష్టతరమగురాజ్యము నీవుగెలుచుట దుస్తర
ములలో దుస్తరము, కావున నీగర్వము నిఁక జాలించు మని
చెప్పెను. రాజామాటలకు మఱింత నాశ్చర్యమును జెందిదా
నిం జెప్పుమని బ్రతిమాలెను. అప్పు డాజ్ఞాని "ఓరాజా ఆరా
జ్యముకొఱకు నీవు దూరముపోనక్కరలేదు. అదినీయందు
గలమోక్షసామ్రాజ్యమే. దానిని బొందనీయక పలుకష్టము
లం బెట్టు కామక్రోధలోభ మోహమదమాత్సర్యము లనెడి

రక్షకులుగా వారు కావలి గాచుచున్నవారు. వారిని జయించినపిమ్మట సంకల్ప మనెడిరాజును జయించవలెను, అప్పుడారాజ్యము నీకు స్వాధీనముకాగలదు అది నీకు సాధ్యమైనతోడనే బ్రహ్మాండమంతయు నీకు స్వాధీనమగును. అప్పుడు గదా నీవు శూరుడవు, అప్పుడుగదా నీవుచక్రవర్తివి. అప్పుడే నీవు ధన్యుడవు. కాన నీ నీడంబమును జాలించు" మని హితోపదేశము చేసెను. అలగ్జాండరు వీటి యర్థమును చక్కగ గ్రహించి "ఓతాపసేంద్రా, నాయపరాధమును క్షమించ' మని వేడి నమస్కరించి చనెను.

## 59 వ కథ.

విశిష్టాద్వైతమత స్థాపకుండును బరమభాగవతోత్తముండు నగుశ్రీరామానుజులవారికి వారిగురుమూర్తి రహస్యముగ నొకమంత్రమును జెప్పి దాని ప్రభావమును దెలియంగఁజేసి దానినితరులకుఁ జెప్పక యతిరహస్యముగ నుంచుమని చెప్పి యాయనచేఁ బ్రమాణము చేయించుకొనెను. ఆమఱునటిదినమే రామానుజులవారు దూరంతయు జాటింపఁజేసి

జనులనందఱిని యొకచోటునకు రప్పించి తానొక యున్న
తస్థలమునందు నిలిచి సంసారబద్ధులై యవివేకాంధకారములో
మునిఁగి యల్లాడుచున్న యామనుష్యుల నందఱిం జూచి చినిగు
లఁజాలికొంది తాను నేర్చుకున్న మహామంత్రమును దాని
ప్రభావము, గొంతెత్తి యందఱికి వినిపించునట్లు చెప్పఁగ
జేసెను. అప్పుడు ప్రక్కనున్న గురువులవారు తనశిష్యుని
యసత్యమునకును, నప్రమాణమునకును, ద్రోహమునకును
విస్మయము చెంది యోరి పాపీ, పరమనీచ! యెంతటిఘోర
పాపమునొడిఁ గట్టుకొంటివి! నీవొనరించిన గురుద్రోహ
మునకు రౌరవాదినరకము ప్రాప్తమగునని తెలిసియు నేల
యిట్లు జేసితివని యడిగెను. అప్పుడా దయాసముద్రుఁడు
రెండుహస్తములను జోడించినవాఁడై దేవా? నే నొక్కఁ
డను నరకకూపమునఁ బడుటచే ననేకులు తరించుచున్నా
రు. నాదేహమును, నాత్మయుఁగూడ మానవకోటికి రక్ష
ణార్థమైబలిగా సమర్పణచేసితినని చెప్పెను.

### 60 వ కథ.

శ్రీరంగావధూతలవారిని నొకపండితుఁడు "మీరువివాహము చేసుకొనరాదా" యని యడిగెను. అందుకువారు "జాతరలో దిరుగుట తేలికే గాని గంతులువేయలేకచావవలె" నని ప్రత్యుత్తర మిచ్చెను.

### 61 వ కథ.

ఒకయక్షుఁడు ధర్మరాజును లోకమునఁ బరమాశ్చర్యకరమైన వింతయేమని యడిగెను. అందుకు ధర్మరాజిట్లనియె. "సృష్టియందలి పిపీలికాది బ్రహ్మపర్యంతముగల ప్రతివస్తువును నశించునదే యని యెఱింగియు, ననుదినము నెన్నియో జీవులు జచ్చుచుండుట కండ్లారఁ జూచుచుండియు మనుష్యుఁడు దానుమాత్రమునశింపక యెల్లకాలము స్థిరముగ నుండులాగున యుంచుసంగతి నావంతయైన విచారింపకయైహికవిషయములందే పాటుపడుటకంటె నెక్కువయాశ్చర్యమేమికల" దని ప్రత్యుత్తరమిచ్చెను.

### 62 వ కథ.

నామదేవుఁడను పరమభాగవతోత్తముఁడు తన చిన్న

ద్రవ్యమంతయుఁ బేదలకు దానముచేయుటచే నతఁడు మిక్కిలి దరిద్రదశలో నుండఁగా కరుణాపూర్ణుండగు భగవంతుఁడు గనిపెంచి యాభక్తునకుఁ గొన్ని వరహాల మూఁటల నిచ్చెను. అప్పుడావైరాగ్యశీలుఁడు మిగుల దుఃఖించి "దేవా? నీవు నాకొసంగిన ఐశ్వర్య మంధునకు దీపదానము చేసినట్లును, నపుంసకునకుఁ గన్యాదానము చేసినట్లునున్నది. వాంఛాశూన్యుఁడ నగునాకు ద్రవ్యమేల? నీపాదారవిందములే నాకు మహాభాగ్యము"ని యాద్రవ్యమునహితము దానముచేసి భగవధ్యానపరాయణుండై యుండెను.

## 68 వ కథ.

భక్తాగ్రేసరుండగు కుచేలుఁడెల్లప్పుడు భగవద్భక్తిచే సర్వప్రపంచమును మఱచియుండుటవలన బిడ్డలు దినుట కన్నములేక కట్టబట్టలులేక కృశించి స్పృహదప్పియుండుట జూచి భార్యమిగులఁ జింతాక్రాంతురాలై తదేకనిష్ఠాగరిష్ఠుఁడైయున్న తనపెనిమిటిచెంతకుఁ బోయి "ఓప్రాణేశ్వరా? మీరుసదాయిట్లుండుటచే బిడ్డలగతిఁజూడకున్నారుగదా',

యనెను. అంతకాభక్తుఁడు చిఱునవ్వునవ్వి "ఓ కాంతా? నేనా వాండ్లగతిఁ జూచువాడను! తండ్రులకెల్లఁ దండ్రి యయిన శ్రీమన్నారాయణుండే యందఱిని రక్షించువాడు. అడవిలోనున్నపక్షుల కాహార మెవ్వరు పెట్టుచుండిరి. రాతిలోనున్న కప్పను బోషించువా రెవరు? మనకు బండ్లు లేక నములుటకు శక్తి లేనప్పుడు అదయానిధి పాలిచ్చి మనలను బెంచలేదా? వాడేమనలను రక్షించును. గావున దుఃఖింపకు" మనెను. అందులకామె యసంతుష్టురాలై "నాథా! మీబాల్యస్నేహితుఁడగు శ్రీకృష్ణుని యాచించి కొంతధనమును దెచ్చి యీయాపదను దొలఁగించకూడదా" యనెను. ఈమాటల కాపరమభాగవతుఁడు చిఱునవ్వునవ్వి "అహా అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండగు భగవంతునిచెంతకుఁ బోయి ధనము యాచించుట కల్పవృక్షముచెంతకుఁ బోయి మట్టిపెళ్ళను యాచించునట్లుండు" ననెను.

## 64 వ కథ.

కబీర్‌దాసు మ్లేచ్ఛుఁడగుటచే వాని కొకగురువర్యుఁ డతనిని

దన దగ్గఱఁజేర్చుట కిష్టములేక యెన్నివిధముల ద్రోసివేసి
నను నాభక్తుఁడు కొంచమైనను విసుకు చెందక తిరిగి పోవు
చుండెను. అట్లుండనొకనాఁడు గురువుమిగుల నాగ్రహ
మును జెంది దనపాదుకచేఁ గప్పీయుశిరస్సునుండి రక్తము
గారునట్లు కొట్టెను. అప్పుడాశాంతిమూర్తి మిగుల నానంద
ముతో "దేవా నేనుయిప్పటికిగదా ధన్యుఁడనైతిని. మీపా
దుక నాశిరస్సుకు దాకినంతనే నాపాపములన్నియు నశించి
కృతార్థుడనైతి" ననిచెప్పెను. గురువు వాని యసమాన
సుగుణసంపత్తికి నాశ్చర్యముచెంది తనయవివేకమునకు
సిగ్గు పడెను.

## 65 వ కథ.

సోక్రటీసు ఒకనాఁడు గాఢమైన విచారణయందుండ
ఁగా భార్యయాతని బిలిచెను. అందుల కాయనమాటలాడఁ
నందున మిగుల గోపించి ఊరంతయుఁ బ్రతిధ్వని యగునట్లు
అఱచుచుఁ దిట్టుచు మాషింపుచుండెను. అప్పటికిని నాతఁడు
చలింపకుండుటచే నామె పట్టరాని యాగ్రహమును

జెంది యొకకుండతో బురదనీళ్లను దెచ్చి యాయననెత్తిపైఁ గుమ్మరించెను. అప్పటికిని నామహానుభావుఁడావంత యయినను గోపించక పకపక నవ్వుచు "ఆహా ఉరిమినవుడే వర్షించు ననెడిలోకోక్తి యిప్పుడుగదా సాదృశమైనదని'' పలికి తిరిగి తనయాలోచనయందే మగ్నుఁడై యుండెను.

## 66 వ కథ.

ఒకానొకఁడు మిగులభక్తితో ఒకదేవాలయమందుండిన దేవతా విగ్రహము నారాధించుచుండెను. ఒకనాఁడాతనికి స్వప్నములో భగవంతుఁడు ప్రత్యక్షమై "ఓభక్తుఁడా నీకు నాయందలి భక్తికి సంతోషించితి. నాప్రియభక్తుండొకఁడీయూరువెలుపల నుండు దేవాలయమం దున్నాడు. అతనిచెంతకుఁ బోయినచో నీకు జ్ఞానోపదేశము జేయుననెను. ఈకలఁ గాంచినంతనే యాభక్తుఁడు మిగుల సంతసించి యాదేవాలయమునకుఁ బోయెను. అచట నొకఁడిగంబరి తనరెండుపాదములను దేవతావిగ్రహముపైఁబెట్టి పరుండుటఁ జూచి అయ్యో నేనెంతమోసపోతిని, కలనిజమను

కొని యిచటకువచ్చి యిట్టిదుష్కార్యమును జూచుట సం
భవించినదని మిగులనాగ్రహమును, పరితాపమును గలవాఁ
డై "ఓయీయున్మత్తుడా! నీకుఁ గండ్లు గాన్పించుటలేదా?
ఇంతటిమూర్ఖమా భగవంతుని శిరస్సుపైఁ బాదములుబెట్టుట
కెట్లు సాహసించితివ" ని కోపించెను అప్పుడా దిగంబరి
అయ్యా! కోపించకుము నాకు దేహస్పృహ లేకుండుటచే
యిట్లు చేయుట గలిగినది నాయందనుగ్రహించి నాపాద
ములను భగవంతునిమీఁదనుండి తొలగించి పుణ్యముగట్టు
కొనుమూ యని వేడినంతనే యాభక్తుఁడు వానిరెండు పాద
ములనుబట్టి ప్రక్కకులాగెను. తోడనే యాస్థలమందొక
దేవతావిగ్రహము గాన్పించుటచే మఱియొకప్రక్కకు
లాగెను. తక్షణమే యక్కడ నొకవిగ్రహము గన్పించుఁగా
భక్తుఁ డాశ్చర్యమునొంది యాదేవాలయమంతటను వాని
నీడ్చెను. కానివానిపాదములు నెచటఁ బెట్టినను నచట
భగవంతుని విగ్రహము గన్పించుటచే, ఆహా యిదేమి
చిత్రము! భగవంతుడు సర్వవ్యాపియయి యున్నాఁడే

అయ్యో నేనెంతటి పాపిని. ఈమహానుభావుని నిష్కారణముగ దూషించి పాపముగట్టుకొంటినే అని చింతించి యాబ్రహ్మవేత్తకు సేవయొనర్చి ధన్యుఁడయ్యెను.

## 67 వ కథ.

పరమదుర్మార్గుం డగురావణాసురునితమ్ముం డగువిభీషణుఁడు తనసోదరునిపాపకృత్యములు సహింపఁజాలక యాతనివీడి శరణాగతరక్షకుం డగుశ్రీరామచంద్రుని శరణు చొచ్చెను. తోడనే యాకరుణాసముద్రుఁడు వాని కభయమునిచ్చి లంకాపట్టణమునకుఁ బట్టాభిషిక్తునిఁగ జేసెను. అంతట లక్ష్మణుఁడు అన్నఁజూచి "దేవా, మీరింతతొందరపడితిరేల! రావణుఁడే వచ్చి మీకుశరణుచొచ్చిన మీరపుడేమి సేతురని యడిగెను. అందుకాపావనమూర్తి "ఓతమ్ముఁడా, రావణునకే యంత భక్తిగలిగి తనపాపకార్యమునకుఁ బశ్చాత్తాపచిత్తుఁడై నన్నుశరణు చొచ్చినయెడల, నారాజ్యమంతయు నాతనికిచ్చి 'నేనరణ్యవాసమే చేసెదను', అని చెప్పెను.

## 68 వ కథ.

ఒకకుష్ఠురోగి తనవ్యాధిబాధ సహింపఁజాలక ప్రాణత్యాగము చేసికొనవలెనని యొకనాఁడు నదీతీరమునకుఁ బోయియుండుమకబోవుచుండెను అప్పుడు కబీర్దాసుగారిశిష్యుఁడగు పద్మనాభుడు వానింజూచి మిగులజాలినొంది రామనామమును మూఁడుమాఱులుచ్చరించినఁతోడనే యాకుష్ఠరోగి కష్టములు దీఱిస్వస్థతఁజెంది మహానందభరితుఁడయ్యెను. ఈవృత్తాంతమంతయు భక్తాగ్రేసరుండగు కబీరునకుఁ దెలిసినంతనే యాగ్రహమునొంది “ఓశిష్యా పవిత్రమగు రామనామము నింతస్వల్పకార్యమునకై మూమ్మారు వ్రయ పెట్టితివా? అట్టిమహామంత్రమును త్రికరణశుద్ధిగనొక్కమారుచ్చరించిన మాత్రముననే యెట్టియసాధ్య మగుకార్యమైనను సాధించవచ్చునే, నీకింకను బూర్ణమైనభక్తికలుగలేదు గదాయని చింతించెను.

## 69 వ కథ.

ఒకనాఁడొకఁడు జాన్సన్' అనుతత్వవేత్తయొద్దకుఁ

బోయిఅయ్యో చచ్చితి, చచ్చితి. నింక నాకేమిగతి? ఎందుఁ బోదునని దుఃఖించెను. జాన్‌సన్ ఆశ్చర్యముతో నీకేమి సంభవించినదని యడిగెను. అందుల కాతఁడు "అయ్యో యిఁక నీప్రపంచమున మానవుఁడేమిచేయఁగలఁడు? మనుష్యునిజీవితము నూఱేండ్లకంటె నెక్కువలేదుగదా" అవ్యంతములు లేనికాలప్రమాణములో నూఱేండ్లన నెంతయల్పము? ఇందునర్ధకాలము నిద్రయందే గడచిపోవుచున్నది. ఇంతియే గాక మిగిలినయర్ధకాలములో బాల్యమున నాటపాటలయందుఁ గొంతయును, యౌవనమునఁ గామక్రోధాదులకులోనై యుక్తాయుక్తములరయక తిరుగుటయందు గొంతయును, వృద్ధాప్యమునఁ గరచరణాద్యవయవములుఁ పట్టుదప్పనేమియుఁ జేయఁజాలనిస్థితియందును వ్యర్థమైపోవుచున్నది. ఇదిగాక అప్పుడప్పుడు గలిగినసావకాశమంతయుఁ దినుటయందును, త్రాగుటయందును గడచుచున్నది ఇదంతయుబోగా మిగిలినయించుకకాలము బిడ్డలతోడను స్నేహితులతోడను, బంధువులతోడను గృహకృత్యములను

చక్కఁబెట్టుకొనుటతోడను పోవుచున్నది. మానవునిజీవితమంతయు నిట్లుపలువిధముల నితరవృత్తులచే నాక్రమించఁబడియుండ మనుష్యునికిఁ బరమార్థచింత జేయుటకు నావకాశమెట్లుండును. స్వతస్సిద్ధముగా మనుష్యునికి నావకాశమే లేనప్పుడికఁ నీదేవాలయములెందుకు, బోధకులెందుకు, గ్రంథములెందుకు? కాల్పనా! ఆరోగ్యాయిఁక వేఁడరించు టెట్లు! నాకు నావకాశ మెక్కడిది! యని యేడ్చెను. ఇదంతయు 'జాన్ సన్' విని కొంచెమాలోచించి వెక్కివెక్కియేడవసాగెను. ఆమనుజుఁడు నీవెందుకేడ్చుచున్నావని యావేదాంతి నడుగ "ఆరోగ్యాయిఁక నాగతియేమి నాభుక్తిగడచుటెట్లు! మనమెంతయో పెద్దది యనుకొనుచున్న యీప్రపంచమంతయు బ్రహ్మాండములోనొక యావగింజంతయైయుండదుగదా, యింతయల్పప్రపంచము మూఁడుభాగములుసముద్రమయమై యొక్కపాలుగదా నివాసయోగ్యమైనది. ఆయొక్కభాగములోఁ గొంతయడారులచేతను, మఱికొంత కొండలచేతను నాక్రమించఁబడి మిగిలినకొంచములో

జాలాభాగము నదులచేతను, సరస్సులచేతను నాక్రమించఁబడి, మిగిలినయింక మఱికొంచెము పట్నములచేతను నిముస దారులచేతను రోడ్లచేతను నాక్రమించఁబడఁగా మనుష్యున కెంతమిగిలి యుండునో యోచించుము. మహాసూక్ష్మముగ ఈప్రపంచమందు మిగిలిన యత్యల్పభూమియందెన్ని కోట్ల జీవరాసులు బ్రతుకవలెనో చూచుచు, ఇన్ని జీవరాసులజీవనముగడుపఁగా నింక మనుష్యునకేమి మిగులును? ఒకవేళనిసుమంత మిగిలిన నెన్నికోట్లమంది మనుష్యులు బ్రతుకవలెను? అయ్యా యింక నాకుగతియేమి నేనెట్లు బ్రతుకుదును" అని యేడ్చెను. ఇదంతయు నాతఁడు విని "అయ్యా మీరు చెప్పినదంతయు యుక్తియుక్తముగానున్నను నీభూమియందు మీరు బ్రతుకుటకు నాహారము లేకపోలేదు. మీరు దుఃఖించుట వట్టివెఱ్ఱితన" మనెను. అందుల కాతత్త్వవేత్త "అయ్యా నేను దుఃఖించుట వెఱ్ఱితనమైనచోఁ బరమార్థచింతనసేయుటకు నావకాశమే లేదని మీరు దుఃఖించుట యంతకన్న వెఱ్ఱితనముగదా?" యనెను.

## 70 వ కథ.

రామతీర్థ స్వాములవారికిని అమెరికా దేశమునందొక క్రైస్తవ మతాచార్యునకును జరిగినసంభాషణ.

క్రై—స్వామీ, మీమతమగోచరముగా నున్నది! మీరుభగవంతుని నమ్మెదరా లేదా?

రా—లేదు, నేనుభగవంతుని నమ్ముటలేదు. నాకుఆయన విషయమై యనుభవమే. ఒకదానిని దెలియనప్పుడే నమ్ముటయు నమ్మకపోవుటయుగాని, తెలిసినతరువాత, నమ్ముటకాదు, యనుభవమే.

క్రై—ఆహా యిదేమివింత, పోనిమ్ము నీకుఆత్మగలదనియైన నొప్పుకొనెదవా?

రా—లేదు, నాకుఆత్మలేదు, నేనేఆత్మను, నాకుదేహముకలదు. దేహములన్నియునావే.

క్రై—మీది విపరీతమతముగా గాన్పించుచున్నదే!

రా—విపరీతమేకాదు, సర్వోత్కృష్టమతము.

క్రై—నీమతము నెవరైన గ్రహించగలరా?

రా—గ్రహించిననాకేమి? గ్రహించకున్ననాకేమి? సత్యమును బోధించుటే నాపని. సత్యబీజములు విరజిల్లుటే నాకార్యము. అవియెప్పటికైనను మొలకలెత్తకమానవు.

కై—నిన్ను బిచ్చివాఁడని యనుకొనెదరేమో!

రా—అనుకొననిమ్ము, కురుక్షేత్రమందు నేఁగృష్ణునిగావచ్చి బోధించినప్పుడుమాత్రము నన్ను గ్రహించఁ గలిగిరా? పాలస్తీనుయందు నేనుయేసుక్రీస్తుగా నవతరించి బోధించినప్పు డెంతమంది నన్నుగ్రహించఁగలిగిరి? తిరిగియిప్పుడు మరియొకసారి ఘంటానాదముగ బోధించుచున్నాను.

కై—నీమాట లతిగంభీరముగ నున్నవే! నీవేమి, ప్రవక్తవా? లేక అవతారమా?

రా—ప్రవక్తయు, అవతారమును, నాక్రిందివే. పరమాత్మనేనేను.

కై—నీబోధ తెలుసుకొనుట కెంతకాలము బట్టునో,

రా—ఎంతకాలమైననాకేమి! యుగములు నావే, కల్పములు నావే, అనంతకాలమునాదే. ఇదంతయు నాయాటయే యానెను. అంతనాక్రైస్తవుఁడమ్మహనీయునిఁ యపూర్వంగు ప్రత్యుత్తరములకు విస్మయమునొంది మారుబలుకఁజాలక వెడలిపోయెను.

## 71 వ కథ.

ఒకరాజొొకభక్తుని కొకయమూల్యమగుపట్టువస్త్రమునిచ్చెను. ఆభక్తుఁడు దానిందీసుకుబోయి, గుడ్డలులేక చలిచే గజగజవణకుచు భిక్షమెత్తుకొనుచున్నొక ముసలిదానిపైఁ గప్పెను. ఈసంగతి రాజుకుఁదెలసి అగ్రహామనస్కుఁడై యాభక్తునిఁ బిలువనంపి "ఓరీ, నన్నెంతయవమానపరచితివి! నీకుబహుమాన మిచ్చినవస్త్రమేదని" యడిగెను. అంతట నాభక్తుఁడు రాజా, నీవిచ్చినబహుమానమును, సకలచరాచరప్రపంచమునకు నీశ్వరియగు జగన్మాతకు సమర్పించితి" నని చెప్పినంతనే, రాజుసిగ్గుపడి క్షమాపణవేఁడెను.

## 72 వ కథ.

'అబ్రహామ్' అను క్రైస్తవభక్తుఁడు ప్రతిదినము తనయిం
టిముందరఁ గూర్చుండి బాటసారులకొఱకుఁ జూచుచు,
వారుకనుపించినతోడనే వారినిదగుసన్మానముతో నింటికిఁదీసు
కొనిపోయి తగునుపచారములు చేయుచుండెడివాఁడు.
ఇట్లుండ నొకనాఁడు నూరుసంవత్సరములు వయస్సుగలనొక
కడువృద్ధుఁ డట్లువచ్చుచుండుటఁజూచి "అహా! నేఁడేమి
నాపుణ్యము! ఇట్టియతిథి నాకెప్పుడును లభింపలేదు, అని
సంతసించుచు యతనిఁగడుభక్తితో నింటికిదీసుకొనిపోయి
కాళ్లుగడిగి, పిండివంటలతో భోజనముబెట్టెను. అంతటవా
వృద్ధుఁడు మిక్కిలిసంతోషమున దినుటకుఁ బ్రారంభించెను.
అప్పుడు 'అబ్రహామ్' ఆశ్చర్యముతో "ఓముసలివాఁడా
నీకింతవయసువచ్చినను లోకనాయకుండగు పరమేశ్వరుని
నారాధించకయే భుజించుచున్నావు. ఇప్పుడైనను యాదే
వదేవుని స్మరించి భుజించుమా" యనెను. అప్పుడాముసలి
వాఁడు "అయ్యా నేనెన్నఁడును దేవుని బ్రార్థించియే యెఱు

గ నాజన్మమధ్యమందు వానినొక్కసారియైన దలచలేదు, నీవు దేవుఁడు దేవుఁ డన్నవాఁడున్నవాఁడో లేనివాఁడో నాకుదెలియదు. అట్టివానిఁ బ్రార్థించనేల" యనిచెప్పినంతనే అబ్రాహాము మిగులఁ గోపముగలవాఁడై యాముసలివానిని దనయింటనుండి రాత్రియనిగూడవిచారించక తరిమివేసెను. ఆరాత్రి పరమదయాళుండును, జగములకెల్లఁ దండ్రియు నగుభగవంతుఁడు అబ్రహామునకు దర్శనమిచ్చి ఆముసలివానిని వెళ్ళఁగొట్టుటకుఁ గారణమేమని యడిగెను. అంతనాభక్తుఁడు "దేవా వాఁడు పరమనీచుఁడు, కృతఘ్నుఁడు భక్తిశూన్యుడు అట్టిమహాపాతకుఁడు నాయింట నుండఁగూడదని తరిమివేసితిని" అనిచెప్పెను. అంతనాదయానిధి "ఓక్రూరుఁడా, వాఁ డెట్టివాఁడైనను నాబిడ్డయేగదా? నూరుసంవత్సరముల నుండి నేనువానిని రాత్రింబగళ్ళు గాపాడుచుండఁగా నొక్కరాత్రి నీవు కాపాడలేక తరిమితివిగదా" యనెను. ఈమాటలకు అబ్రహాము సిగ్గుపడి బుద్ధితెచ్చుకొని నాఁటనుండి యందరియందు నొకేవిధమున దయగలవాఁడై ప్రవ

త్రించుచుండెను.

## 73 వ కథ.

పడమటలంకయందు సాధనాశ్రమములో నివసించుచున్న సీతారామావధూతను గొందఱసూయాపరులా యవధూతలవారికిని వారిశిష్యులకు నవమానము కలుఁగజేయ నెంచి వారిప్రియశిష్యుఁ డైనశాంతానందుని మిక్కిలిబాధించి యంతటితోఁ దృప్తిఁజెందక వారియాశ్రమము నిర్మూలముఁ జేయయత్నించుచుండగా వారియందుభక్తి గలకొందఱు గృహస్థులీపాపకృత్యమును నివారింపఁబూనికొందఱు రాజభటులను దీసుకవచ్చి యాదుష్టులను బంధించి చెఱసాలకుఁబంప యత్నించుచుండఁగాఁ బరమపావనుం డగునా యవధూత యాగృహస్థులతో నిట్లనియె “తండ్రులారా, రాజభటులచే మీరుకొందరినిమాత్రమే స్వాధీనము చేసుకోనఁగలరు, గానిముల్లోకములను స్వాధీనము చేసుకొనగల్గిన యొకమహామంత్రమును మీకుఁజెప్పెద. దానింగ్రహించి జయశాలురుకండని చెప్పినంతనే వారుదానిందెల్పుమని

వేఁడిరి. అంతవారు చిఱునగవుతో “శాంతమే యీమహా మంత్రము. శాంతముచే బ్రహ్మాండ మంతయు జయించవచ్చును” అనియుపదేశించి, వారుచెప్పినచొప్పున వారియాగ్నుతశాంతమే వారివిరోధుల మనంబులనుగూడఁ గరగించి వారితోం దనురాగము గలవారలుగాఁ జేసెను.

## 74 వ కథ.

శ్రీసీతారామావధూతలవారిశిష్యుఁ డగుశాంతానందుఁడు దుష్టులచేమిగుల బాధింపఁబడియుండ వారిహితులు “అయ్యో, యీపరమదుర్మార్గులు మీకెంతకష్టము గల్పించిరి” అనిమొఱపెట్టుచుండ నాశాంతనిధి “తండ్రులారా, వారినినిందించకుఁడు వారు నాకు బరమమిత్రులు, నాశాంతమును బరీక్షించుటకై యేతెంచిన దయామయులుగా వారి భావించుచున్నా” నని నుడివిరి.

## 75 వ కథ.

శ్రీరామచంద్రులు రాక్షససంహార మొనరించి సీతామహాదేవితోఁ దిరిగియయోధ్యఁ బ్రవేశించి పట్టాభిషిక్తుఁడైన

కాలమందు శ్రీ ఆంజనేయుల వారికిఁ దేవేంద్రునిచే సమర్పించఁ బడిన యొకయమూల్య మగుపచ్చలపతకము నొసంగిరి. ఆభక్తాగ్రేసరుఁ డాపతకము నోటఁబట్టి యొకచెట్టుకొమ్మనెక్కి యందలిరత్నముల నొక్కొక్కటి కొరికి తుబుక్కున నేలపై నుమియుచు దానినంతయుఁ బాడుచేసెను. దీనింజూచి లక్ష్మణుఁడు మిగులనాగ్రహముఁ జెంది శ్రీరామచంద్రునితో నీసమాచార మంతయు నెఱుంగఁజేసెను. వెంటనే శ్రీరామమూర్తి యాంజనేయులను బిలిపించి యాంజనేయా నీకోతిచేష్టలు మానవైతివిగదా? నీకిచ్చినపతకము జూపుమని యడిగెను. అప్పుడాపరమపావనుఁ డంజలిబద్ధుఁడై "దేవా మీరు నాకిచ్చిన పతకమునందలి మణుల నొక్కొక్కటియుఁ గొఱికి చూచితి, నములి చూచితిఁ, గాని యందొక్కదానికిని రామనామమాధుర్యము కొంచమైనను గానిపింపలేదు, దేవా, నేనేమి యపరాధముఁ జేసితి? నాకిట్టినిస్సారపువస్తువ నేలదయచేసితి" రని యడిగెను. లక్ష్మణుఁడు వీని యనుపమభక్తికి నచ్చెరువునొందెను. రామమూర్తి మిగుల సంతసించెను.

## 76 వ కథ.

ఒకనాఁడు సీతారామాశ్రమములవారికి కొందఱుస్త్రీ లొకపళ్ళెరమునిండఁ పిండివంటలనుదెచ్చి వారినోటఁ బెట్టు చుండిరి. అప్పుడువారు వానినన్నిటిని భుజించి “తల్లు లారా, మీభక్తికి సంతసించితి. కానిమీరు నాకుఁ బెట్టినట్టి పదార్థము లన్నియుఁ గోటీశ్వరుని కొక్కగవ్వదానము చేసినట్లున్నది. నేనాకలిదప్పులు లేనివాఁడను. ఆకలిచేఁ బరితపించుదీనులకు వీనింబెట్టినచో నిక్కలిప్రయోజనకర మగును. బ్రహ్మానందముచేఁ గడుపునిండినవాకు వీనిఁ బెట్టు టకంటె భక్తియనెడిఫలములను బెట్టినచో మీరుధన్యు లగు దురని హితోపదేశము చేసెను.

## 77 వ కథ.

ఒకబ్రాహ్మణుఁడు తనభార్యతోఁ గలహించి యిల్లువి డచి సంతోషాయనుజ్ఞాని చెంతకుఁబోయి “ఓస్వామీ, నేనునిస్సార మగుసంసారమును ద్యజించి వచ్చితిని. నన్నుఁ గృతార్థునిఁ జేయు” మనిప్రార్థించెను. అప్పుడాభక్తుఁడు

వానిప్రార్థన నంగీకరించి తనచెంతనే యుంచుకొనెను. పిమ్మటవానికి నాకలిగలిగి సంతోషానుఁజూచి "స్వామీ నేనాకలిబాధను సహింపఁజాలకుంటిని. తినుటకేమైన బెట్టుమని ప్రార్థింపఁగా వారతని యొకవృక్షపుచ్చకాయ నిచ్చి తినుమనిచెప్పెను. ఆబ్రాహ్మణుఁడు దానిని గొంచము నోటబెట్టుకొని యదిమిక్కిలిచేఁదుగా నుండుటచే దినఁజాలక దుఃఖించుచు సంతోషానుఁ జెప్పఁగా నాపరమయోగి చిఱునవ్వునవ్వి "యోగిప్రా వైరాగ్యశీలురకు రుచియిట్టి దని తెలియదు. నీకట్టివైరాగ్యము గలుగకమునుపే సంసారము విడచివేఁగ యిక్కడికి వచ్చితి" వనియాతని యింటికిఁ దిరుగఁ బంపెను.

## 78 వ కథ.

శ్రీ శుకమహర్షికిని రంభకును జరిగినసంవాదము.

రం—ఓశుకమునీంద్రా, అయ్యో, నీయౌవన మంతయుఁ
గారడవులపాలుజేసి కాలమంతయు వృధాపుచ్చు
చుంటివే!

శు—వనితా! భగవత్సందర్శనముకై పాటుపడుటకు యౌవనమే తగుకాలముగాని వృద్ధాప్య మగునా?

రం—మునిశ్రేష్ఠా, కామిగానివాఁడు మోక్షకామి యెట్లగును?

శు—తరుణీ! హరియం దైక్యము నొందఁగోరుటే కామము. ఇంతకన్న నుత్కృష్ట మైనకామము మఱియొకటికలదా?

రం—స్త్రీపురుషుల యన్యోన్యముకన్న సుఖమున్నదా? అట్టి సుఖమును ద్యజించుట యెంతవెఱ్ఱితనము!

శు—అవా! యేమంటివి, క్షణభంగురమై దుఃఖదాయకమై తుచ్ఛమైన కామినీసుఖ మెక్కడ! పరబ్రహ్మానుసంధాయకమగు నిత్యానందమెక్కడ!

రం—ఋష్యోత్తమా, సకలధర్మవేదులగుమీకుఁ దెలియని ధర్మములు లేవుగదా! తానైకోరి వచ్చినయువతీమణిని నాదరించకపోవుట భ్రూణహత్యామహాపాతకమునకుఁ గారణముగాదా?

శు—కాంతా, నీవుచెప్పినధర్మము మహాంధు నగుకాముకు లకుఁ జెల్లునేమోకాని తపముచే నడవుల గాలము పుచ్చుయోగులకుఁ గాదుసుమా!

రం—పూర్వఋషుల్లు కోరివచ్చినమేనకను విశ్వామిత్రుఁడు చేరఁదీయలేదా పర్వతముని హారిణి యనుదేవవే శ్యను నాదరించలేదా? వారెల్లయుమీవంటి యోగులు కారా?

శు—తరుణీ, నీవుచెప్పినవారు స్త్రీసాంగత్యమున యోగభ్ర ష్టులై యెన్నియో యిడుములపాలై రనినీవు విని యుండవా?

రం—మునిశ్రేష్ఠా, వేయిమాటలేల స్త్రీలపొందే నరకహేతు వైనచో భగవంతుడు స్త్రీలనేల పుట్టించవలెనో పరికించి చెప్పుమా?

శు—ప్రపంచమునే సత్యమునినమ్మి సంసారసాగరమున మునిగితేలెడు గృహస్థులకొఱకే స్త్రీలను సృష్టించె నుగాని, ప్రపంచమంతయు స్వప్నతుల్యముగా

గాంచినతపోనిష్ఠాగరిష్ఠు లగుమునీంద్రుల కొఱకుఁ గాదుసుమా?

రం—మునీంద్రా, కులముచెడనిమ్ము, తపంబులు మంటఁగల యనిమ్ము, బంధువులు వెలిఁబెట్టనిమ్ము, తల్లిదండ్రులు వుందనిమ్ము, తనకన్నియిడుములు పొడమినవోర్చిచంద్రునిబోలుముఖకాంతులు గలకాంతలఁ జేపట్టి, సుఖించువాఁడే ధన్యుఁడుసుమా!

శు—పంకజాక్షీ, తనభార్య యెంతకుందినను గుందనిమ్ము, బంధువు లెంతచిన్నచూపునఁ జూచినమజూడనిమ్ము; లోకులుతన నెంతదూఱినను దూఱనిమ్ము, అన్నిటి యందును నభిమానశూన్యుఁడై, యాత్మబోధాసుధా రసమును గ్రోలుమహానీయుఁడే ధన్యుఁడుసుమా!

రం—మునీంద్రా, కళలనుదెలిసి, మన్మథుఁడే నిజదైవమని నమ్మి! సదాస్త్రీలోలత్వముచేఁ గాలముపుచ్చువాఁడే పూజ్యుఁడుసుమా?

శు—రంభా, వేదములుచదివి, అజ్ఞానము నణఁగఁద్రొక్కి,

ముక్తికాంతంగలవి తన్మయత్వము నొందుమహాను
భావులే పూజ్యులుసుమా!

రం—వేదములన్నియు బూడిదగానిమ్ము, పరమాత్మ పాడు
గానిమ్ము? మోక్షపదము మంటఁగలయనిమ్ము, నిండువె
న్నెలయందు, రమణీయమగుముద్యానవనముల లేజ
వ్వనులతో విహరించు పుణ్యపురుషునికే సదాన
మస్కరింతును.

శు—అవివేకీ, యేమంటివి! ఘోరారణ్యముల నివసించుచు,
దనశాంతస్వభావముచే, క్రూరమృగంబులసహజబు
ద్ధిని గూడమాన్పి, వానితో నన్యోన్యమైత్రినివిహరిం
చుచు హరిధ్యానపరాయణుం డైనమహనీయునికే
సదా నమస్కరింతును.

రం—ఆర్యా, నన్నేలబాముల బెట్టెదరు. మదనతాపమున
కోర్వలేకనీకు శరణంటిని రక్షింపుఁడు, శరణాగత
రక్షణమునకన్నఁ దపమున్నదే!

శు—వనితా, అదిసత్యమేగాని అసమర్థుఁడేమి చేయఁ

గలఁడు? గార్బలుని శరణువేఁడిన కాచిరక్షింపఁగ లఁడా?

రం—అయ్యయ్యో, మునీంద్రా, ఇట్లనుటన్యాయము, నామన వాలకింపవా! నీవు నపుంసకుడఁవా! నన్నే లబాముల ముంచెదవు!

శు—బాలా, నన్నేల యీలాగున బాధించెదవు? నేను నపుంసకుఁడనేకాదు. నపుంసకులలో మొదటివాఁడనుసుమా!

రం—ఎంత పిచ్చివాఁడవు! సుందరీమణులఁ గూడిన సౌఖ్యము నీకనుభవములేక యట్లనుచున్నావు సుమా!

శు—ఛీ! ఛీ! మలమూత్రములతోఁ గూడి, దుర్గంధమయమై, పైకిమాత్రము వన్నెచిన్నెలుఁ జూపునీతనువులమర్మ మేరికి తెలియును! తరుణీ నీకొకనమస్కారము. ఇం తటితోఁ జనుము.

రం—మునీంద్రా, ఇదియా నీసందేహము! నేను దేవాం గన నను మాట మఱచితివా? ఇదిగో. నాశరీరము

చింపి చూపెదఁ జూడుము. మానవులశరీరమువలె దుర్గంధముగాక సుగంధమయమై మనోహరమై, దేదీప్యమానమై యున్నది. ఇఁక నన్నుఁ జేకొనుమా! (అనిపొట్ట చీల్చిచూపెను).

(అంతమహదానందభరితుఁడై)

శు—"తల్లీ, ఆబ్రహ్మదేవుఁ డటువంటిసుగంధమయమై, పరిశుద్ధమైన నీకడుపునఁ బుట్టఁజేయక నాజన్మము వ్యర్థమొనరించెఁగదా!" అనిబల్కు రంభ శుకయోగియొక్క నిశ్చలవిరాగమునకు నచ్చెరువునొంది, సిగ్గుపడి, నమస్కరించి వెడలిపోయెను.

## 79 వ కథ.

ఒక యరణ్యమందు నివసించునొకఫకీ రొకనాఁడు పెద్దపులిచే మిక్కిలిబాధకరమగు గాయమును బొందినవాఁడై, దుఃఖించు చున్నసమయమున నొకఁడు వానింజూచి "అయ్యో యాపులి నిన్నెంతబాధించె" నని యోదార్చుచుండ నాఫకీరు "అయ్యా నేనుబాధకై విచారించుటలేదు.

ఇంతకు వేయిరెట్లెక్కుడగుబాధ కలిగినను, విచారములేదు. గానియిట్టిశిక్షను భగవంతుఁడు నాకువిధించుటకు నేనేమి పాపము చేసితినో కదాయని నాపాపకృత్యమునకై వగచు చున్నాననెను.

## 80 వ కథ.

ఒకపట్టణమందు ఒకమిక్కిలి బలాఢ్యుఁడు గలఁడు. అతఁడు బరువులు మోయుటయందుఁ దనకెవ్వరును సాటిలేరని యధికగర్వము గలవాఁడై యుండెను. అతఁడొకనాఁడత్యాగ్రహంబున గ్రుడ్లెఱ్ఱఁజేసి, నోటఁజొంగఁ గార్చుచు, కత్తిని ద్రిప్పుచుఁ, బలుకుచుండ నొకఁడువానిఁజూచి వానియాగ్రహమునకుఁ గారణమడిగెను. అప్పుడావస్తాదు "ఒకస్త్రీ నన్నుఁదిట్టినది. అందుచేదానిని జంపుటకుఁ బోవుచున్నా" నని చెప్పెను. ఇదివినినంతనే యాతఁడునవ్వి "ఓహో యిదియే నీబలము! నీవెంతయోగొప్పభారములను మోయఁగలనని ప్రగల్భములు కొట్టుచుంటివే, ఒక్కయాఁడుదానివాక్యమునే మోయలేకపోతివి." యనిచెప్పినంతనే

యాతఁడు సిగ్గుపడి యింటికిమఱలెను.

## 81 వ కథ.

ఒకబాటసారి మలమలమాడు చున్నయెండువేసవిలో నడచిపోవుచు మిగులనలసి యొకపెద్దమఱ్ఱివృక్షమునుగాంచి దానినీడనుబడియుండి, యావృక్షమును బారఁజూచి “అహా! యేమిది, భగవంతుఁడు సర్వజ్ఞుఁడని యనుకొంటినే చిన్నగుమ్మడిచెట్టునకు బానలంతకాయలుచేసి మిక్కిలివిస్తీర్ణమగు మఱ్ఱివృక్షమునకుఁ గుంకుడుగింజలంతకాయలను సృష్టించెను, మనుష్యుననున్నంతవివేకమైనను నున్నట్లుగా న్పించ” దనితనలోఁ దానుదలంచుచు నిద్రించెను. ఇట్లించుకనిద్రించి లేచినతోడనే తనదేహముపై మఱ్ఱికాయలు రాలియుండుటఁజూచి విస్మయమొంది అహా! నేనెంతమూఢుఁడను! సర్వేశుఁ డొనరించుప్రతికార్యమును మనమేలునకేనని గ్రహింపఁజాలక యజ్ఞానముచే బ్రహ్మాండములకెల్లఁ బ్రభువగు నాదేవదేవుని దూఱితినిగదా! ఈమఱ్ఱివృక్షమునకే గుమ్మడికాయ లంతకాయ లుండినయెడ నొక్కకాయ

నాపైఁ బడినచోఁ జరుగుగదా; అంతియేగాక దీనినీడ నను భవించెడి యనేకకోట్లజీవరాసులకుఁ బ్రాణాంతకమై యుండునే! ఆహా! భగవంతునికార్యము లెంతయగోచరములు! అనుచు వెడలిపోయెను.

## 82 వ కథ.

ఒకఁడొకభక్తునియొద్దకుఁ బోయిస్వామీ యెట్టివిరోధులనైనను దయతో నాదరించుమని చెప్పితిరిగదా కామక్రోధములనుమాత్ర మేలదయతో నాదరించరా దనెను. అందుల కాభక్తుఁడు ఎట్టివిరోధియైనను దుదకుఁ గ్రూరమృగమైనను దయకులోఁబడి దానిసహజ మగుకార్యమును మానునుగాని కామక్రోధములకు దయచూపుటచే వాటిదుర్మార్గము హెచ్చుచుండును గావున వాటియెడ మాత్రముదయ నేమాత్రమును జూపరాదనెను.

## 83 వ కథ.

ఒక రాజొకఫకీరును నీ వెప్పుడైన నన్నుఁదలచెదవా యని యడిగెను. అందుకు ఫకీర్ ఆహా తలచెదను. భగ

వంటివి మఱచినప్పుడా. చిత్తము భగవదాయత్తము గాని యప్పుడు బాహ్యవిషయములను జింతించును గాని రాజుల కెల్ల రాజును రక్షకులకెల్ల రక్షకుడు నగు సర్వేశ్వరుని యందు లీన మైనప్పుడె యితరవిషయములు జ్ఞాపకము వచ్చును? అనిజవాబు చెప్పెను.

## 84 వ కథ.

ఒకనాడు “జహీద్, అను ఒకమతగురువు ఒకరాజుచే విందునకుఁబిలువఁ బడెను. అప్పు డందఱును మిక్కిలియు త్సాహముతో నక్కడ నమర్చబడిన రుచిగలపదార్థములను నారగించిరి? కడుపుబ్బునట్లు దినుచుండఁ “జహీద్” దన నెల్లరును మహాభక్తుఁ డని కొనియాడుటకై చాలఁ దక్కు వగా భుజించి నమాజ్ (దైవప్రార్థన) దీర్ఘకాలము చేసెను. ఇంటికిఁ బోయిన వెంటనే యన్నము పెట్టుమని యాజ్ఞాపిం చెను. మూర్ఖబుద్ధిగల యాతనికుమారుఁడు “దండ్రీ, మీరి పుడేగదా విందారగించి వస్తిరి. అప్పుడే యాకలియయ్యె నా? యనియడుగఁగ, దండ్రి “కుమారుఁడా యొక ప్రయో

జనము నుద్దేశించి రాజుగారియెదుట నే నేమియుఁ దినలే' దని చెప్పెను. అంతట నాగురుఁడు "నాయనా, నీవిక్కడ చేసిన వానిలో నేదియుఁ బ్రయోజనకారిగాఁ జేయలేదు గావున నీ ప్రార్థనలనుగూడ నీతిండివలెనే తిరిగి చేయు మనెను.

## ౮౫ వ కథ.

ఎపిక్టిటస్, అనువిరాగి సమస్తవిషయములను విసర్జించి, భగవద్ధ్యానము చేయుచుఁ, జేతనైనంతవఱకు నితరులకు సహాయము చేయుచుఁ గాలము గడుపుచుండెను, ఒక నాడు దొంగలు, ఎపిక్టిటస్ యొక్క గుడిశెలో ప్రవేశించి యందొక దీపపుస్తంభమును దప్ప మఱేదియుఁ గాంచక యద్దానినే దొలగించుకొనిపోయిరి. అప్పు డాభక్తుడు 'అయ్యో! నే నెంతపాపిని, నేను సర్వవిషయములను విడిచి పెట్టియు, నీదీపస్తంభము నొకదానినుంచుకొంటిని, ఇది యుండఁ బట్టియేకదా వారికి దీనిని దొంగిలించ వలెననెడి దుర్బుద్ధిపుట్టినది, అయ్యో వారొనరించినపాపమునకు నేనే

కారకుఁడను గదా యనిచింతించి నాటనుండి తిరిగి దీప మంగూడ బెట్టుకొనుటయే మానుకొనెను.

## 81 వ కథ.

శిఖిధ్వజుఁ డనునొకరాజు తప మాచరించుటకై యడవికిఁ బోయెను. బ్రహ్మజ్ఞాని యగు నతనిభార్య రాజునకు నిజమైన మార్గమును బోధించఁ దలఁచి మునివేషమును దాల్చి రాజు చెంతకుఁ బోయెను. ఆచట నొకఘోరారణ్యమునందుఁ జిన్నపూరిగుడిశె నిర్మించుకొని యందుపద్మాసనాసీనుండై ధ్యాననిష్ఠయందున్న యారాజు నెదుట నామెనిలిచెను. రాజు మునివేషముతోనున్న తనభార్యను గుర్తించక తన్నుఁ గృతార్థునిఁ జేయుటకై దర్శనమిచ్చిన ఋషోత్తముండని తలఁచి యామెపాదములకు నమస్కరించి "దేవా, నాకు మోక్షప్రాప్తియగుటకుఁ, దగునుపదేశము చేసి నన్ననుగ్రహింపుఁ" డని వేఁడెను అంతనామె "ఓ రాజా, నీవు సర్వసంగపరిత్యాగము చేసితేగాని మోక్షము లభించ" దనెను. అంత రాజు "ఆహా, యేమి, నేను సకలభోగములను వీడి,

కాషాయధారినై, యరణ్యమున నేకాంతముగాఁ దపమాచరించుచుండియు, నేను సర్వసంగపరిత్యాగిని కానఁట! (అని యాలోచించి) ఓహో తెలిసినది! ఈయరణ్యమందు సహితమొకకుటీరము నేర్పరచుకొంటిని. దీనిని నిర్మూలముగా వించెదనని, వెంటనే నాయింటిని మంటఁగలిపి యామెకును మస్కరించి “దేవా, ఇప్పుడనుగ్రహించుమఁ” డని వేఁడెను. అప్పుడునునామె “ఓరాజా, నీవుసర్వసంగపరిత్యాగివైనఁగానిముక్తిలభించ” దనెను. రాజువిస్మయముచెంది యటునిటు చూచి, ప్రక్కనున్నతన దండకమండలములను గాంచి, వానినగ్నిలోఁ బాఱవైచి, చేతులుజోడించి తిరిగియామెను వేడెను. అంతనామె మునుపటివలెనే సర్వసంగపరిత్యాగివే మోక్షమునకర్హుఁడనెను. అంతరాజు తనకింకను నొకగోచి యుండుటఁజూచి దానినిగూడఁ బెరికి యగ్నిలోఁబడవేసి “మహానుభావా, యిప్పుడునిజముగ నేను సర్వసంగపరిత్యాగిని ఇఁకసంశయములేదు. ఇంకనైన యనుగ్రహింపుఁడు” అనిబల్కినంతనే యామె, యారాజుభుజ

ముపైఁ జేయువైచి "యీదేహ మెవ్వరిది" యనియడిగెను. వెంటనే రాజా "నాదే" యనెను. అంతనామెరాజా సర్వ సంగపరిత్యాగియే మోక్షమున కర్హుఁడని తిరిగిచెప్పెను. రాజాకొంచమాలోచించి ఆహా! నేను సమస్తము విడిచినను ఇంకను నాదేహము మిగిలియున్నదే! ఛీ, దీనింగాల్పవలె నని యామంటలోనికిదుముకఁ బోవుచుండెను. వెంటనే యామె, యాతనిచేయిఁబట్టుకొని "రాజా, "నిలువుము! నిలువుము! యేమిచేయుచున్నావు" అనియడుగ నారాజు "నాదేహమునుగూడ పరిత్యజించుచున్నా" నని చెప్పెను. అంతనామెరాజా నీదేహము కాలినపిమ్మట యేమియగునని యడుగ "బూడిద యగు" ననెను. అంతనామె "అబూడిదె యెవరిది" యని తిరిగి యడిగెను. రాజు అదియు నాదే" యనెను. ఆమె "రాజా సర్వసంగపరిత్యాగికే మోక్షము లభించును సుమా"! యనెను. అంతరాజా "ఓహో యిదేమి యాశ్చర్యము! నేనుజచ్చినను నాబూడిద మిగులుచున్నదే!" నేనుసర్వసంగపరిత్యాగ మింకనెట్లు చేయవలెను" అనియే

మియుఁ దోచక యామెపాదములపైఁ బడి "దేవా, సర్వసంగపరిత్యాగము చేయు తెఱం గెఱింగించు మనివేఁడెను. అంతనామె "రాజా, ఈరాజ్యమునాది, ఈభార్యాపుత్రాదులు నావారలు ఈసకలభోగములునావి, ఈదేహము నాది, ఈమనస్సునాది, యీ మొదలగు వాటియం దన్నిటియందును నాదినాదియను మమకారము కలిగియున్నావు. అదియే బంధమునకుఁ గారణము. కానిబాహ్యవిషయములను విసర్జించిన మాత్రముననే సర్వసంగపరిత్యాగి కానేరఁడు. ఈమమత్వబుద్ధి యేక్షణమందు విడిచెదవో యాక్షణముననే మోక్షమును బొందఁగలవు" అని చెప్ప ధీశాలియగు నారాజు అన్నిటియందును మమకారమును వీడి, వెంటనే యాతని నిజస్వరూపంబగు పరిపూర్ణసచ్చిదానంద పరబ్రహ్మమును బొందినిరవధిక తేజోవిరాజితవదనారవిందుడై ప్రకాశించెను.

## 87 వ కథ.

పూర్వకాలమం దొక యోగిసత్తముడు కలఁడు. ఒక

ప్పుడు మృత్యుదేవత యతనిప్రాణములను గొనిపోవుటకే తెంచినప్పుడతఁడు తనయోగబలముచేఁ దనరూపమువంటివి యనేకరూపములను సృష్టించెను. మృత్యుదేవత యారూపములనన్నింటిని జూచి నిజమైనమనిషిని గనుగొనలేకపోయెను. అంతకొంతతడవు విచారించి తుదకొకయుపాయమును గనుఁగొని "ఆహా! యేమినీశక్తియుక్తులు; అంతయుఁ జక్కఁగనే యున్నదిగాని, నీవొక్కలోపముమాత్రము జేసితివిసుమా!" యనెను. ఈమాటవినినంతనే నిజమైనమనిషి నొక్కఁగంతునలేచి "నేనెక్కడ తప్పుజేసితిని! చూపు" మనియడిగెను. తక్షణమే మృత్యువు వానింబట్టి "ఇదియేనీతప్పు, అదినీయహంకారమే! ఓయీ నీకెంతసామర్థ్యమున్నను, నిష్ప్రయోజనమయ్యెసుమా" యనిచెప్పి యీడ్చుకొనిపోయెను.

## 88 వ కథ.

ఒకఫకీరువద్దఁ గొంతద్రవ్య ముండెదానిని గడుదరిద్రునకియ్యవలెనని చూచుచుండెను. అప్పుడాదారినే యాయూ

యరాజు యేనుగపైనెక్కి పోవుచుండగా ఫకీరుచూచి యాధనమంతయు రాజుపైవిసరివేసెను. రాజాశ్చర్యము చెంది యందులకుఁ గారణమడిగెను. అప్పుడుఫకీరు "రాజా యీద్రవ్యమును గడుదరిద్రునకియ్యవలెనని యనుకొంటిని. నీకంటెదరిద్రుఁడు గాన్పించలేదు. ఏలయన, ఐశ్వర్య మెంత హెచ్చుగానుండునో కోరికలంతమెండై యుండును. ఎవరికి కోరికలు విశేష ముండునో యట్టివాడే కడుదరిద్రుఁడు. కావననీవె నాకర్హుఁడవుగాఁ గాన్పించితివి" అని జనులం చెప్పెను.

## 89 వ కథ.

ప్రపంచ మంతయు బ్రహ్మస్వరూపమని గురువుచెప్పగా విని యొకరాజు తనభార్యతో "రాణికిని దానికిని భేదము లేదు. గనుక నేటినుండి నీదాసీవారు రాణిగానుందు" నసెను. రాణి యీపిచ్చివేదాంతమునకు విచారించి నాఁటి రాత్రి రాజునకు భోజనము పెట్టినపు డొకగిన్నెతో నన్నమును, మరియొకగిన్నెలో నావుపేడయు దెచ్చి యెదుటపె

ట్టైను. రాజుదీనినిజూచి మిగుల నాగ్రహముచెంది భార్య నుగొట్టఁ బోయెను. అప్పుడు రాజుభార్యనవ్వుచు, "నాథా, మీరు మహాజ్ఞానులు. దాసికిని రాణికిని భేదములేదని సర్వమును సమదృష్టితోఁ జూచువారలు, గోమయమునకు నన్నమునకును భేదమేల చూచుచున్నారో తెలియకున్నదనెను. ఈమాటలు వినినంతనే రాజుతనయజ్ఞానమునకు సిగ్గుపడి యూరకుండెను.

## 90 వ కథ.

ఒకరాజకొమారుఁ డరణ్యమునకుఁ బోయి దారితప్పి యడవి యంతయుఁ దిరుగుచు నొకయాశ్రమముచెంతకు వచ్చె. అచ్చటఁ దపమాచరించుచున్నయొకమునిపుంగవుని జూచి నమస్కరించి దారియడిగెను. ఆముని యాతనింజూచి, నీవెవ్వండవు, నీపేరేమి యనియడుగ నాతఁడు "నాపేరు మోహజిత్తు" అనిచెప్పెను. మునియాశ్చర్యమున "ఓహో! రాజులకేమి, మోహజిత్తనుపేరేమి! మోహము నజయించినవాఁడే మోహజిత్తు. అదినీకుఁ దగినపేరుకా"

డనెను. అంతనాబాలుఁడు దేవా "మోహజిత్తును నేనే
కాదు. మాయింట నున్నవారందఱు మోహజిత్తులే"
యనెను. అంతనాముని మతింతయాశ్చర్యము చెంది వాని
మాటలు పరీక్షించ దలంచి నారాకొమరుని వస్త్రములు
దీసుకొని వాటిపైరక్తమువంటి యెఱ్ఱనిరంగుచల్లి, యబ్బా
లుని నక్కడనే యుంచితాను రాజుచెంతకుబోయెను.
రాజమందిరముచెంతకు వచ్చినతోడనే యచట నొకదాసి
నిగాంచి "అయ్యో! మీ యువరాజు వ్యాఘ్రమునోటఁబడి
చచ్చినాఁడు" అనిదుఃఖించెను. దాసియామునిని గాంచి
"స్వామీ యిందుదుఃఖించుట కేమికారణ మున్నది? పుట్టి
నవాఁ డెప్పటికైనను జావకయుండునా?" యనిబల్కి
యావంతయుఁ జలించక తనదారిఁ బోయెను. ఆతాపసి
దాసియొక్క మనోనిశ్చలతకు నాశ్చర్యమునొంది రాజుకడకే
గెను. సింహాసనముపైఁ గూర్చుని యున్నరాజును జూచి
"అయ్యోరాజా! యెంతయుపద్రవము! యెంతఘోరము!
నీముద్దుబిడ్డఁడగు నీవరపుత్రుఁడు క్రూరమృగముచేఁ జంపఁ

బడెను, ఇవిగో యాతనిదుస్తులు" అనిచెప్పి వెక్కి వెక్కి
యేడువసాగెను. కాని రాజసుమంత్రియైనను గలఁతచెంద
కౌఁటిమునివరేణ్యా, యిందాశ్చర్యమేమి? ఒక చెట్టుపై నలు
దిక్కులనుండి వచ్చినపక్షులు రాత్రియంతయుఁగలసియుం
డి తెల్లవారినంతనే తిరిగి దేనికది యెగిరిపోవును, ఈచం
దముననే సంసారవృక్షముపైనెక్కడెక్కడిజీవులో
యేతెంచి కొంతకాలము కలసియుండి తిరిగి కాలమాస
న్నమైనతోడనే దేనికదియే తొలఁగుచున్నది. ఇందు వింత
యేమి?" అని పల్కినతోడనే ముని నిశ్చేష్టితుఁడై యక్కడ
నుండిలేచి రాజుభార్యచెంతకుఁబోయి "అయ్యో, తల్లీ,
యిక నీసంతోషదినములు సున్న యయ్యెను! ఇవిగో నీకు
మారుని రక్తవస్త్రములు. అతఁడు వ్యాఘ్రమునోటఁ బడి
మృతుఁడయ్యెను." అని మిక్కిలి విలపించెను. అంతనారా
ణిఆశ్చర్యముతో "యేమీ! మునివర్యా! ఇందులకేనా
మీరింతదుఃఖించుట! నలుదెసలనుండి వచ్చుబాటసారు
లొండొకసత్రమునఁగూడి కొంతకాలము గలసియుండి

తిరిగి యెవరిత్రోవను వారుపోవుచుందురు. ఈప్రపంచమే యొక గొప్పసత్రమువంటిది. జీవులందఱును మోక్షపురికిఁ బోవుచు మార్గమధ్యమం దీసత్రమునందుఁగలసి తమతమకార్యములం జేసుకొని తిరిగి తమతమదారులం బోవుచుందురు. ఇంత దుఃఖించుటకు గారణము గాన్పించుట లేదని శాంతచిత్తముతో నుండెను. ఈమె మనోస్థైర్యమునకు మునిదిగ్భ్రమచెంది రాజొమరుని భార్యచెంతకు వెళ్లి “అమ్మా తల్లీ! యిట్టిదుఃఖవార్త నేనెట్లు చెప్పుదును! పిడుగువంటియీపాడువార్త నీ వెట్లుభరింతువో గదా! అమ్మా నీవు స్వయంవరమందు వరించిన నీమనోహరుఁడు పులినోటఁబడి మృతినొందెను. ఇవిగో వానిరక్తబట్ట” లని చెప్పి కడుపుబ్బ నేడువసాగెను. అంతనామెనవ్వుచు “ఓహో ఋషిసత్తమా మీవంటితపోధనులు కారణములేకయే యింతదుఃఖించుటఁ జూడనవ్వు వచ్చుచున్నది! వేలు వేలువడవుల యందుఁ బెరిగినచెట్లకొమ్మలు నదీప్రవాహమునఁబడి యొకచోటఁగలసి యొకచోటనే తుదకు మహాసముద్ర

ములోఁ గలియుడనట్లు మానవులజీవయాత్రకూడ నింతటిదే గదా! శాంతింపుఁ" డని రోదార్చెను. అప్పుడాఋషి ఆహా! నిజముగ వీరందఱు మోహజిత్తులే" యిఁక వీరిని బరీక్షింప నవసరములేదని తెలిసి తానుబన్నిన మాయానాటకము యొక్క రహస్యమును వెల్లడిచేసి రాజకుమారుఁడు సుఖంబునఁ దనయాశ్రమమందున్నాఁ డనిచెప్పెను. అప్పుడువారందరు నీశుభవార్త కిసుమంతయైన సంతసింపక నిశ్చలులై యుండ వారందఱకి నొక్కనమస్కారము చేసి శీఘ్రముగఁ దనయాశ్రమమునకు జని యాబాలునితో "అయ్యో! బాలకా, నే నేమని చెప్పుదును. ఈదుఃఖవార్త నీకెట్లుఁ దెల్పఁగలను! నీరాజ్యమంతయుఁ బరరాజులపాలై నీతల్లిదండ్రులు, భార్యామిత్రులు, నాదుష్టరాజు క్రూరఖడ్గమునకు బలియై నీకోటయంతయు దగ్ధమై పోయినది. అయ్యో, యెంతకష్టము! యెంతకష్టము! అని దుఃఖించెను. ఈభయంకరవార్తల కామోహజిత్తునిముఖ తేజము కొంచమైనను మార్పుచెందక శాంతముతో నిట్లుపల్కెను.

“ఓమునివర్యా! రాత్రివేళ గలలో దాను జూచినవన్నియు సత్యమనినమ్మి వాటికై పరితపించుటకంటె నజ్ఞానముక లదా? ఈరాజ్యము, ఈసంపదలు ఈభార్యబిడ్డలు, ఇవియు న్నియుఁ గలవంటివేసుమా! ఎప్పటికిని నిత్యమై, చలనరహి తమై నిత్యానందదాయక మైనపరబ్రహ్మమొకటియే సత్యము గాని యివంతయు సత్యముకాదు. దీనికైదుఃఖించుట యెంతవెఱ్ఱితనము! అని చెప్పి నిశ్చలముతో నున్న యాబా లుని గాగిలించుకొని “ఓహో యేమినాభాగ్యము, మీవం టినిశ్చలజ్ఞానులదర్శనంబుచే బావనుండనైతి” నని తాను జేసినపరీక్ష నంతయు విస్తరించి చెప్పెను.

## 91 వ కథ.

భక్తాగ్రేసరుండగు ‘కబీర్‌దాసు’ మూఁడుదినములనుండి యన్నమదొరకనికతంబున మిక్కిలియాకలి గొనియుండ కెచ టనో యొకరొండినరొట్టెయుఁ గొంచము నేయియు!సంపా దించి భుజించుటకై కూర్చునియుండఁగా నింతలో నొక కుక్క యారొట్టెను దీసుకొని పారిపోవుచుండెను

అప్పుడు కబీరు "ఓస్వామీ! రొట్టెయెండియున్నది. కడుపు నొప్పివచ్చును. నేతిలో ముంచుకొని యారగింపు" డని యా కుక్కవెంట, నేతిగిన్నెఁ బట్టుకొని పఱుగెత్తెను.

## 92 వ కథ.

"తుకారాం' అనుభక్తునిచెంత కొక స్త్రీవచ్చి మృతినొందిన తనపిల్లను నెదుటఁబెట్టి బ్రతికించుమని యేడ్చెను. చెంతనున్నజను లామెనుజూచి "ఓసీ, పిచ్చిదానా, నీపిల్లను బ్రతికించుటకుఁ దుకారాంస్వామి యొద్దనమృత మున్నదనుకొంటివాయేమి?" అనిపరిహసించిరి, ఆమాటలు ఆపరమభాగవతోత్తముఁడు విని "ఓభక్తులారా, శ్రీహరినామామృతముకన్న నమృతము మఱియొకటికలదా"? యనిభగవన్నామోచ్చారణ చేసినంతనే యాశవము తిరిగిబ్రతికెను.

## 93 వ కథ.

కాంతస్వరూపుఁ డగుశిష్యునితొడలపైఁ దనగురువు శిరస్సునుంచి నిదురఁబోయి లేచినపిమ్మటఁ గర్ణునితొడలనుండి రక్తధారలు కారుచుండఁ జూచి విస్మయమొంది "ఓశిష్య

గన్నయూ, నీతొడలనుండి రక్తప్రవాహములాటకు గారణ మేమని యడిగెను. అందుల కాశాంతమూర్తి “దేవా, మీరు నాతొడలపై నిదురించుసమయమున నెద్దియో యొక పురుగు నాతొడలను దొలుచుచుండెను. దేవరవారికి నిద్రాభంగము గలుగు నేమోయని బాధనుసహించి కదల కయుంటి” నని జవాబు చెప్పెను.

## 94 వ కథ.

భానుదాసుఁ డనునొకభక్తుని కుటుంబసంరక్షణార్థమై యాభక్తునిచే వానిహితు లొకబట్టలయంగడిని బెట్టించిరి. ఆయంగడికి విలువయైనవస్త్రములను గొనవచ్చువారి కాభక్తుఁడు “ఓజనులారా, రోతయగుశరీరమునకు మంచివస్త్రములను గోరుట, పుండుమీదఁ జుట్టుటకుఁ గనకాంబరములను గోరునట్లుండును. మీరెంతమంచివస్త్రములచే శరీరము నలంకరించినను లోపలనుండు మలమూత్రరక్తాదులకు మార్పుకలుగదు. ఈవస్త్రముల కిచ్చుద్రవ్యముచే భగవంతుని బిడ్డలగు దీనుల కిచ్చుటవలన మీకిహపరసుఖములు

గలుగును" అని హితోపదేశము చేయుచుఁ దనవద్దకు
వచ్చు చేరగాండ్లను బంపివేయుచుండెను.

## 95 వ కథ.

ఒకనాఁ డొకప్రదేశమున నన్నిమతములలో నుండెడి
ప్రాముఖ్యులును మతచర్చ చేయుచుండిరి. అప్పుడు శివమ
తస్థుఁడు శివుఁడే దేవుఁడనియు, శివునికంటె నితరదేవత
లను నారాధించువారు పాపకూపమునఁ బడెదరనియు,
విష్ణుమతస్థుఁడు శ్రీమహావిష్ణువే భగవంతుఁడనియుఁ గ్రీస్తు
మతస్థుఁడు యేసుకంటె నన్యదైవము లేఁడనియు నిటందఱు
వాదించుకొనుచుండిరి. అప్పుడొకజ్ఞాని వారియజ్ఞానమును
గ్రహించి శివమతస్థునితోఁ "నీవు శివుఁడేదేవుఁ డనిచెప్పు
టకు శివుని జూచితివా"? యనెను. విష్ణుమతస్థుని "నీవు
విష్ణునిజూచితివా" యని యడిగెను. ఇదేవిధమున నన్నిమత
స్థులవారిని బ్రశ్నించ నందొక్కరును దాముచూచియుండ
లేదని చెప్పిరి. అంతట నాజ్ఞాని "అయ్యలారా, మీవివా
దము లిందుచేతనే కాని నిజముగ భగవంతుని జూచిన

వారికి నెట్టివివాదములుండ" నవిచెప్పి వారివివాదములను మాన్పెను.

## 96 వ కథ.

ఒకఘోరరక్కసి తనయాహారార్థమై దేవతలను భక్షించుచుండెను. ఇంద్రుఁడు మిగులభయము గలవాఁడై యిట్టి యాపదనుండి దేవతలను రక్షింపుమని భగవంతుని వేఁడఁగా నాదయామయుఁడు "ఓయింద్రా దధీచియను మద్భక్తుం డొకఁడు ఏకాగ్రచిత్తుఁడై తపమాచరించుచున్నవాఁడు. అతనివెన్నెముక యారక్కసికి పుట్టించినమాత్రముననే యారక్కసి మృతినొందును" అనిచెప్పెను. కాని యింద్రుఁడది తనకెట్లు లభ్యమగునాయని మిగులఁ జింతాక్రాంతుఁడై యామునివర్యునిచెంతకుఁబోయి యీసంగతినంతయు విన్నవించెను. అప్పుడామునిశ్రేష్ఠుఁడు "అహా! యింతస్వల్పమునకై మీరింతచింత నొందనేల? ఈశరీరము పరోపకారార్థమేగదా ఇదిగో నావెన్నెముకను దీసుకొం" డని తాను ప్రాణత్యాగము చేసెను.

## 97 వ కథ.

పారసీకదేశమం దొకపట్టణంబున "రబియా" అను నొకగొప్పభక్తురాలుండెను. ఆమె యొకానొక సమయమందు మిక్కిలిబాధకర మగువ్యాధిచేఁ బీడింపఁ బడుచుండ "మాలిక్" "హస్సన్" అనునిద్దరు తత్వవేత్తలు వానినోదార్చవచ్చిరి. అందులో "హస్సన్" అనువాఁడు "రబియా" యొక్కయాపదకు మిగులదుఃఖించి యతనితో "ఓరబియా, నిజమైనభక్తి గలవాఁడు భగవంతుఁడు విధించిన దండనలను గష్టమనక మిక్కిలియోర్పుగలిగి యనుభవించవలె" నని ధైర్యము చెప్పెను. అంత "మాలిక్" యొక్కువ జ్ఞానము కలవాఁ డౌటచే "ఓభక్తాగ్రేసరా, భగవంతుఁడు మనకు విధించినదండనలనోర్పుతోడ ననుభవించుటయే కాదు, వానిని సంతోషముతోడ ననుభవించ వలె" నని పల్కెను. అంతభక్తశిఖామణి యగునారబియావారి కింకను జ్ఞానము కలుగ లేదని గ్రహించి "ఓప్రియస్నేహితులారా" భక్తిగలవాఁడు భగవంతుఁడు తనను దండిచె

ననియే తలంపఁడు" అని ప్రత్యుత్తర మిచ్చెను.

98 వ కథ.

పూర్వకాలంబున గొందఱు ముముక్షులు భగవన్మహిమను బూర్తిగఁ దెలిసికొనవలె నని యిచ్ఛగలిగి దీర్ఘకాలంబు తపంబు చేసిరి. ఇట్లు నూరుసంవత్సరములు తపంబొనర్చి నిలిచిన పిదపఁ గండ్లు తెరువఁగనే భగవంతుఁడు వృద్ధబ్రాహ్మణరూపంబున వారిచెంత నగుపడి "ఓ తాపసులారా, మీ రెందుకై తపంబుచేయుచున్నా" రని యడుగ వారు "మేము భగవన్మహిమను దెలిసికొనుటకై తపస్సు చేయుచున్నా" మనిరి. అంత భగవంతుఁడు "అట్టి భగవన్మహిమను దెలిసికొంటిరా" యని ప్రశ్నించ "మే మింక నణుమాత్రమైనను దెలిసికొనలే" దని చెప్పి తిరిగి తపంబు చేయఁ బ్రారంభించిరి. ఇట్లుమఱియొకనూరుసంవత్సరములు నిశ్చల తపంబు చేసి కనులు విప్పినతోడనే తిరిగి భగవంతుఁడు పూర్వమువలెనే ప్రత్యక్షమై "ఓ తపోనిష్ఠాగరిష్ఠులారా, మీ రిప్పటికైన భగవన్మహిమను దెలుసుకొంటిరా" యని

యడుగ "మే మిప్పుడు కొంచెము తెలుసుకొంటి" మని చెప్పి తిరిగి తపవు సేయక తపంబున మున్గిరి. ఇట్లు వారు ఆఱువందలసంవత్సరములు ఘోరతపంబు చేసి కనులు తెరచినప్పుడెల్ల భగవంతునిచేఁ బ్రశ్నింపఁ బడుచుఁ బ్రతి సారియు "మేము పూర్వముకన్న నెక్కువగాఁ దెలుసు కొంటిమి అని చెప్పుచుఁ గడపట ఇప్పుడు మేము తెలుసు కొంటి" మని చెప్పిరి. అందుకు భగవంతుఁడు "ఏమని తెలుసుకొంటి" రనియడుగ "ఆమహామహునిమహిమను బూర్ణముగ దెలుసుకొనుట కెవ్వరికిని సాధ్యము కాదని తెలుసుకొంటి" మని చెప్పిరి. అది విని భగవంతుఁడు మిక్కిలిసంతోషించి "ఆహా మీరే భగవంతుని నిజముగా దెలుసుకొన్నవార" లని చెప్పి తననిజరూపమును వారలకుఁ జూపి యంతర్ధానం బయ్యెను.

## 99 వ. కథ.

ధర్మరాజులవారి నింద్రుఁడు స్వర్గమునకు సశరీరునిగాఁ దీసుకొనిపోవుచుండ మార్గమధ్యమందు నరకములో మహా

పుణ్యవంతులును, సకలసద్గుణసంపన్నులు నగుతననలుగురు సహోదరులును, పతివ్రతాశిరోమణి యగుద్రౌపదియుఁ గాన్పించిరి. పిమ్మట సకలభోగములకు నునికిపట్టగుస్వర్గము నకుఁ బోవ నచ్చట నతిదుర్మార్గు అగుదుర్యోధనాదులు గాన్పించ, నిదేమివిపరీతము? యింతకంటె నన్యాయ మెం తైనఁ గలదా? యని ప్రశ్నించ, ఇంద్రుఁడు "ధర్మరాజా, పుణ్యాత్ములు స్వర్గసుఖముల ననుభవించుటయును, పాపులు నరకబాధల ననుభవించుటయును న్యాయమే. కాని దుర్యోధనాదు లణుమాత్రపుణ్య మాచరించిరి. కావున వారలు క్షణమాత్రము స్వర్గమునం దుండి పిమ్మట వారి యనంతము లగుపాపములకు ఘోర మగు నరకమున నిత్య నివాసము చేయుదురు, మఱియు నీసహోదరులును, భార్య యుఁ గించిన్మాత్రముపాపము నాచరించిరి, వారలే కాదు నీవుకూడ పాపలేశమును చేసితివి కావుననే నీకును యమలోకదర్శన మయ్యెను. ఇంక నీవును నీభార్యయు సహోదరులును స్వర్గమున నిత్యము నుండఁ గల" రని చెప్పెను.

## 100 వ కథ.

ఒకయోగి సముద్రతీరమునందుఁ గూర్చుండి భగవంతుని మహిమను బూర్ణముగఁ దెలియఁగోరి దీర్ఘతప మాచరించుచుండెను. ఇట్లనేక సంవత్సరములు ఘోరతపస్సు గావించి యొకనాఁడు కండ్లుదెరచి చూడఁగా నొకబాలుఁడు దోసిలితో సముద్రజలమును దీసి నావలఁ బారబోయుచుండెను. ఇట్లు దినమంతయుఁ గష్ట మనక చేయుచుండుట యాముని చూచి "ఓయీబాలకా నీ వేమి చేయుచున్నా" వని యడిగెను. అప్పు డాబాలుఁడు "స్వామీ, సముద్రము నుండి జలమంతయు నావలఁ బారఁబోయుచున్నా" నని చెప్పెను. అంత నాయోగి "ఓ బాలుఁడా నీ కేమి పిచ్చి పట్టినదా యేమి? సముద్రజలమునంతయు నావలఁ బోయుట కెవరితరము?" అని చెప్ప నాబాలుఁడు నీవు భగవన్మహిమను బూర్ణముగఁ దెలుసుకొనుటకుఁ బ్రయత్నించుటకన్న నేను బూనినకార్యము పిచ్చి యగునా?" అనిచెప్పి యదృశ్యుం డయ్యె.

## 101 వ కథ.

ఒక బ్రహ్మసమాజకుఁడు శ్రీరామకృష్ణ పరమహంస చెంతకువచ్చి స్వామీ "మీ రెప్పుడు చూచినను మేల్కొనియే యుందురు. మీకు నిద్ర యేల పట్ట" దని యడిగెను. అందులకా పరమహంస "అయ్యా యొకదొంగవానికిఁ దనయింటిప్రక్కనే గొప్పధన మున్న దని తెలిసిన పిదప రాత్రింబగళ్ళు నాచోరుని చిత్తమంతయు దానిమీదనే యుండి, యాధనమంతయుఁ దనకెట్లు లభ్యమగునా యని పరితపించుచు నిద్రపోకయు పోనేరఁడు. అదేవిధమున సచ్చిదానందస్వరూపుఁడగు భగవంతుఁడు మనచెంతనే యున్నాఁడని దృఢముగా నమ్మినవాఁడా భగవంతునిఁ గాంచువరకుఁ బరితపించుచు నిద్రాహారములు సహితము మఱచియుండు నని జవాబు చెప్పెను.

## 102 వ కథ.

ఒకరాజు మిక్కిలిదుర్మార్గుఁడై ప్రజాసంరక్షణ చక్కఁగఁ జేయకుండుటచేఁ బ్రజలందఱొకనాఁడు ఆయుధపాణులై

రాజుమీఁదకు దండెత్తివచ్చిరి. రాజు యీయుపద్రవమునకు సిద్ధుఁడు గాకుండుటచే మిగుల జింతాక్రాంతుఁడై యుండెను. సకలసద్గుణశీలుండగు నారాజుకుమారుఁడు ఇదం తయు నెఱింగి తండ్రిచెంతకుఁ బోయి "తండ్రీ, మీరు చింతించవలదు. నేబోయి శత్రువులను జయించి వచ్చెద, సెలవిండు" అని వేఁడెను. అంతనారాజు "అయ్యో కుమారా, యిప్పుడేమిగలిి, యింతశీఘ్రములో నాసైన్య ములు కూర్చుటెట్లు!" అని నిట్టూర్పులు విడువ నా భాగవ తోత్తముఁడు "నాయనా యీస్వల్పపనికి సైన్యములు కావలయునా, యిదిగో నేనొక్కండనే పోయి శత్రుల నోడించి వచ్చెద నాసామర్థ్యము చూడు" మని వేవేగ గుఱ్ఱము నెక్కి దండెత్తినవారలయొద్దకు బోయెను. రాజ కుమారుఁ డొంటరిగా వచ్చుటఁ జూచి దండెత్తివచ్చినవార లందఱు నాతనిచుట్టును జేరిరి. అప్పు డాయువరాజు వారిని సంతోషముతో నెదుర్కొని, వారి యాగ్రహము నకుఁ గారణ మడిగి, వారిని ప్రియవచనంబులచే శాంతింపఁ

జేసి, వారికష్టసుఖములు తాను జూచుచుందు నని యభయ మొసంగి వారిని సంతోష చిత్తులంజేసి వారివారిగృహములకుం దిరిగి పంపివేసెను. పిమ్మటఁ దండ్రి చెంతకుఁ బోయి తాను విరోధుల సంపత్తిని జయించితి ననిచెప్పఁగా రాజాశ్చర్యమునొంది "ఒంటరిగా నింతటికార్యము నీ వెట్లుచేసితివని యడిగెను. అప్పు డాబాలుఁడు 'తండ్రీ యెటువంటి శత్రుసైన్యములైనను క్షణమాత్రమున జయింపఁ గలుగుశ్రీమాస్త్రిమును బ్రయోగించితి" నని తాను జేసినకార్య మంతయుఁ జెప్పి రాజును సన్మార్గునిగాఁ జేసెను.

## 103 వ కథ.

ఒకానొకమనిషి భగవంతునిఁ జూడఁ దలంచి యాసేతుహిమాచలపర్యంతము నున్నక్షేత్రముల నన్నింటిని దర్శించి తుదకు భగవంతునిఁ గనఁజాలక విసుకు చెంది యొకచెట్టు క్రిందఁ గూర్చుని చింతించుచుండెను. అప్పు డొక బాలుఁడు అక్కడ నిసుకలో నెద్దియో వెదకుచుండుటఁ గాంచి "ఓ బాలకా నీ వేమివెదకుచున్నా వని యడిగెను.

బాలుఁడు "అయ్యా మాయింటిలో నొకనూదిని బారవైచితి. దానికొఱకై వెదకుచున్నా"నని చెప్పెను. అంత నామనిషి పకపక నవ్వి "ఓ బుద్ధిహీనుఁడా మీయింటఁ బారవైచిన నూదిని ఇక్కడ వెదకిన నెట్లు దొరకును?" అని చెప్ప నాబాలుఁడు "నీహృదయమందున్న దేవుని కొఱకు నీవు దేశదేశములు వెదకినట్లు లేదా?" యనిచెప్పి అంతర్ధానుండయ్యె.

## 104 వ కథ.

పూర్వ మొకరాజు తనపట్టణమున రాత్రివేళలందు గస్తి తిరుగుటకై, యొకతలారిని నియమించెను. ఒకనాఁ డాతలారి కద్దిమో కార్యాంతరనిర్బంధ ముండినందున యూరి ప్రక్కపాలములో శయనించి యున్న యొకజ్ఞానిని బట్టి తెచ్చి తనదప్పును వానిమెడకుఁ దగిలించి, నిద్రించుచున్న మనుష్యులను మేల్కొలిపి జాగ్రతగా నుండునటుల పాటించుటకైనియమించెను. అంతటనాజ్ఞాని దప్పువాయించుచు సందుసందుఁ దిరిగి యిట్లు మేల్కొలిపెను,

## మొదటి జామున.

లోకమందు జనులందరు నాశచేత బద్ధులై దుఃఖముల పాలగుచున్నారు. ఆహా! దినదినము నాయుర్దాయము క్షీణించుచున్నది సుమా, జాగ్రత్త! జాగ్రత్త!

## రెండవ జామున.

ఈసిరిసంపత్తులును నిజీవితములును క్షణికములు. నిర్దయుండగుయముండు కాచుకొని యున్నాడు సుమా, జాగ్రత్త! జాగ్రత్త!

## మూడవ జామున.

తల్లిదండ్రులు బంధుమిత్రులు, ధనధాన్యములు ఎప్పటికిని స్థిరముగానుండవు. గాన జాగ్రత! జాగ్రత! యనియు

## నాలుగవ జామున.

దేహ మనెడిగృహమునందు, కామక్రోధము లనెడి దొంగలు ప్రవేశించి జ్ఞానమనెడిరత్నమును దొంగలించ వేచి యున్నారు గావున జాగ్రత! జాగ్రత! యనియు పాటించెను,

## 105 వ కథ.

ధర్మరాజులవారశ్వమేధయాగము చేయునపుడు కృష్ణా ర్జునులిరువురు నశ్వసంరక్షణార్థమై వెంటఁ జనిరి. ఇట్లా యశ్వము దేశదేశములఁదిరుగుచు మయూరధ్వజమహారాజు దేశమునకుఁ బోయినప్పు డారాజు దానిం బట్టుకొనెను. అప్పుడు మహాశూరుం డగు అర్జునుఁడు వానిపై నాగ్రహమున బాణవర్షమును గురిపించ మయూరధ్వజుఁడు నిమేష మాత్రంబున వాటి నన్నింటిని గ్రుంచి యొక్కబాణంబున నర్జునుని మూర్ఛిల్లఁజేసెను. అప్పుడు భువనైకరక్షకుం డగు శ్రీకృష్ణుఁడు చక్రమును గిరగిరఁ ద్రిప్పుచు నారాజుపై సింహామువలె నురుకఁ బోవుచుండఁగా మయూర ధ్వజమహారాజు, కృష్ణా! శాంతిల్లుము నే నెవండనైనది గుర్తించకుం టివి. ఇదిగో దీనిని గైకొనుమని యొక్కబాణము గొట్టగా యాదేవదేవుఁడు సహితము నేలఁ గూలఁబడెను. కొంతతడవైన పిమ్మట నర్జునుఁడు మూర్ఛనుండి లేచి తనయపజయమునకు మిక్కిలిచింతిల్లి యాగ్రహముతోఁ బండ్లు పటపట గొరు

నుచు గాండీవమును జేఁ బూని మయూరధ్వజుఁ గొంఱ కేటునటు చూచుచుండఁ బరమాత్మ స్వరూపుండగు శ్రీకృష్ణభగవానులు "ఓ యర్జునా, యేల యింతయాగ్రహము? నీవు మయూరధ్వజుని జయింపజాలవు. కౌరవులనోడించి నట్లనుకొంటివేమో? నీగాండీవ మాతనిపై నిష్ప్రయోజనము సుమా, శాంతిల్లు" మనెను. అప్పు డర్జునుఁడు మిగుల నాశ్చర్యముచెంది "నాగాండీవము నిష్ప్రయోజన మైనచో నీచక్రముయొక్క సామర్థ్య మేమాయెను" అని మందహాసముచేసెను. అందుకు శ్రీకృష్ణస్వామి "అర్జునా మయూరధ్వజుఁడు నాప్రియభక్తుఁడు అట్టిభక్తునిపై నాచక్రము పోఁజాలదు, నేనుభక్తవత్సలుఁడ నను మాట మరచితివా? భక్తులయభీష్టమును నెఱవేర్చుటయే నాపనిసుమా? లేకున్న ముల్లోకములు కలసి వచ్చినను నాయాగ్రహజ్వాలకు భస్మీపటలము గావా యని చెప్పెను.

## 106 వ కథ.

మయూరధ్వజమహారాజుయొక్క. భక్తియు దాతృత్వ

ముని శ్రీకృష్ణుఁడర్జునునికిఁ జూపవలెనని యిద్దరును బ్రాహ్మణవేషములుదాల్చి యారాజుచెంతకుఁ బోయిరి. అప్పుడా భక్తాగ్రేసరుండు మిగుల గౌరవముతో వారినాదరించి బంగారుపళ్లెములనిండ మణులను నింపి వారియెదుటఁ బెట్టి స్వీకరించుఁడని ప్రార్థించెను. అప్పుడు మాయానాటకసూత్రధారుఁడగు శ్రీకృష్ణుఁడు మఱియొక మాయానాటకము నుద్దేశించి యిట్లుజవాబు చెప్పెను. రాజా, యీధనము నాకేల? నాకొక్కఁడే కుమారుఁడు కలఁడు అతని నొకసింహము పట్టుకొని యీడ్చుకొని పోగానే నామృగరాజును నాపుత్రునివిడువు మని ప్రార్థించితి. అప్పు డాసింహము “రాజా నీవు మయూరధ్వజ మహారాజు దేహము రెండు తునకలుగాఁ గోసి కుడిపార్శ్వమును నాకిచ్చినయెడల నీకుమారుని విడిపింతునని చెప్పినది. నామాటలయం దనృతములేదు. కావలెనన్న నాతోరండు. నేబలికినపలుకు లన్నియు నిజమేయని మీకుఁజూపించెద కాన నోపుణ్యశీలా నాకుఁ బుత్రభిక్షము పెట్టి నన్నురక్షింపుఁడని వేడెను. అప్పు డాపరమ

పావనుఁడు మిగుల సంతోషముతో అహా! నేడెంత సుదినము నే ధన్యుఁడ నైతిని. నాకు జన్మసాఫల్య మయ్యె నాశరీరము నేఁడుగదా పరోపకారార్థమై వినియోగపడు చున్నది. అని లేశమైనను శంకించక మిగుల నానందముతోఁ దనదేహమును వారి కర్పణచేసెను.

## 107 వ కథ.

మయూరధ్వజునిఁ బరీక్షించుటకై వచ్చిన కృష్ణార్జునులా మహారాజు దేహమును రెండుముక్కలుగాఁ గోయుట కారాజుభార్యను బుత్రుని నియమించి శిరస్సుపై రంపము నుంచి కోయుటకుఁ బ్రారంభించిరి. తల కొంచెము తెగిన పిమ్మట నారాజు నెడమకంటినుండి కన్నీరు గారుచుండగాఁ గృష్ణుడుచూచి "ఛీ యిట్టిదానము నాకేల, ఏడ్చుచు నిచ్చిన దానము నేనొల్ల" నని చెప్పి వెడలుచుండెను. అది యామహారాజు చూచినవాఁడై యాబ్రాహ్మణులతో "ఓ భూసురోత్తములారా! మీరిట్లు చేయుటకు నే నేమియపరాధము చేసితిని. బాధచేతఁ గాని యిట్టిదానము మీకిచ్చితినని

గాని నే నేడ్చుటలేదు. అట్లయిన నా రెండుకండ్లనుండి యుఁ గన్నీరు గారవలెఁగదా; దయచేసి వినుండు. నాకుడి భాగము మీవంటిమహానుభావులకు దానముగా వినియోగ పడి యెడమభాగము వ్యర్థమై పోయెనుగదా. నాకేమిగతి యని యెడమకన్నేడ్చుచున్నదే గాని మఱియొకటి కాదు" అని చెప్పఁగా నప్పుడు భగవంతుఁ డాతనిభక్తికిమెచ్చి తననిజస్వరూప దర్శనంబుచే నాతని ధన్యంజేసి యర్జునుని సంశయముదీర్చి వెడలిపోయెను.

## 108 వ కథ.

మహాభక్తుండగు మహమ్మదునికంటినుండి యొకనాఁడు కన్నీరు కాల్వలై పాఱుచుండెను. వారిశిష్యులు దీనిం జూచి ఖిన్నులై "స్వామీ మీరింతగా దుఃఖించుటకుఁ గారణమే" మని యడిగిరి. అప్పు డాదయాసముద్రుఁడు "అయ్యో మనుష్యు లద్వితీయానందము నిచ్చు భగవద్భక్తిని విడనాడి తుచ్ఛములగు ప్రాపంచకసుఖములకు లోనై పడరానియిడుములఁ బడుచున్నారు. వారికెన్నివిధముల

బోధించినను వారిమనసునకుఁ బట్టకున్నది. వారియజ్ఞానమును దలఁచినకొలఁదిని నాకు దుఃఖము కలుగుచున్నదని చెప్పిరి.

## 109 వ కథ.

అనూయాపరు లైనకొందఱు దుర్మార్గులు శ్రీవేదాంతదేశికులవారిని నగౌరవపఱచుటకొకనాఁడు వారియింటి గుమ్మములోఁ దలకుఁ దగులునట్లు పాతచెప్పులను గట్టిరి. అప్పుడా మహనీయుఁడు తనశిరస్సున కవి తాకినంతనే కొంచమైనను విచారించక యిట్లుపలికెను. "ఈప్రపంచమందు ముక్తికొఱకుఁ గొందఱు కర్మమార్గమును, గొందఱు జ్ఞానమార్గమును నాశ్రయింతురు. కాని నేను హరిదాసుల పాదరక్షలను సదా నాశిరస్సున కద్దుకొనుచు భక్తిమార్గము నవలంబించెదనని మహదానందమునఁ బలికినంతనే యాపాపకార్య మొనరించిన దుర్మార్గులు సిగ్గుపడి పశ్చాత్తాపము నొంది వారిశరణు జొచ్చిరి.

## 110 వ కథ.

దరిద్రముచేఁ గృశించుచు, వృద్ధాప్యముచే గజగజ

వణఁకుచున్నయొక మానవుని శ్రీబుద్ధభగవానులు చూచి "నాయనా, యీజీవయాత్ర నీకెట్లున్నది" యని యడిగెను. అందుకాతఁడు "అయ్యా! మనుష్యుఁడు పుట్టిననాఁడనే తనకురాఁబోవు నవస్థలనుగూర్చి కావు కావు మని యేడ్చుచుండును. కావున నిఁక నేఁ జెప్పవలసిన దేమున్నది?" అని బదులు చెప్పెను.

## 111 వ కథ.

శ్రీరంగావధూతలవారి నొకబ్రహ్మసమాజ మతస్థుఁడు "మీకాలము నిట్లువృథా చేయక రేఁపైన నొకగ్రంథమును జదువుకొనరాదా యనెను. అంతట రంగావధూత "అయ్యా! నాకొక క్షణమైనను సావకాశమే లేకున్నది, ఇఁక నేఁ జదువుకొను టెట్లు?" అనిప్రత్యుత్తర మిచ్చెను, అప్పుడా బ్రాహ్మసమాజమతస్థుఁడు తిరిగి "ఏమీ, మీకు సావకాశము లేకున్నదా! మీరేమిపని చేయుచున్నారు?" అని యడుగ నాబ్రహ్మవేత్తపని లేనిపని యందుఁ బూర్ణుఁడనై యున్నానని జవాబు చెప్పెను.

## 112 వ కథ.

శ్రీరామానుజుల వారి శిష్యునిభార్య యొకనాటిరాత్రి నిదురించుచుండఁగా కొందఱుదొంగ లామెపడకటిల్లు ప్రవేశించి మెల్లన యామెనగలను దీయుచుండిరి. ఇట్లు కొన్ని నగలను వారు తస్కరించిన పిమ్మట నాసాధ్వీమణి మెల్లఁ బ్రక్కకు మరలెను. తోడనే వారు భయము చెంది పాఱిపోయిరి. ఈసంగతినంతయు మఱునాఁ డామెభర్తకుఁ జెప్పఁగా నాపరమభాగవతోత్తముఁ డాగ్రహము చెంది „ఛీ, నీ కింకను ధనముపై నాశ పోలేదు. వారు నగలను దీయుచున్నప్పుడేల కదిలితివి? పాపమాదరిద్రులు నీనగలలో సగముమాత్రమే తీసుకొనఁ గల్గిరి గదా" యని కోపించెను. అప్పు డాపతివ్రతాశిరోమణి "నాథా కోపించకుడు ఆదొంగలు నాదేహముపై నున్నయొకవైపు నగలను దీసికొనినపిమ్మట రెండవ వైపునగలుకూడవారు తీసుకొనుటకై రెండవ ప్రక్కకు మరలితిని గాని పాపము వారు భయము చెంది పాఱిపోయిరి" అని జవాబుచెప్ప నామెభర్త యామె

వైరాగ్యమునకు మిక్కిలి యానందించెను.

## 113 వ కథ.

శ్రీబుద్ధభగవాను డొకనాఁడు బాల్యమున, వనమునందు విహరించుచుండఁగా మంత్రికుమారుఁ డగుదేవదత్తుఁ డొక పక్షిని బాణముతోఁ గొట్టెను. అప్పుడది నేలపైఁగూలఁగా దయాసముద్రుం డగుబుద్ధుడు తన కన్నీటిచే దాని మేనంత యుఁ దడుపుచుఁ, దనపట్టువస్త్రముచే దాని రక్తముఁ దుడుచుచు గాయము జెందియున్న యాపక్షినిమృదువైన తనహస్తములచేఁ బట్టుకొని యింటికిఁ బోవుచుండఁగా దేవదత్తుఁ డడ్డగించి " నేను గొట్టినపక్షిని నీవు తీసుకొని పోవుటకు నీకేమిహక్కు గల" దని ప్రశ్నించెను. అప్పుడాదయామయుఁడు " దయ యనెడియధికారము చేతను, ప్రేమయనెడి హక్కుచేతను, నీపక్షి నాదై యున్న" దని చెప్పి దానిం దీసుకొని రక్షించి విడిచిపెట్టెను.

## 114 వ కథ.

ఒకరాజు ధనలక్ష్మికొఱకనేక సంవత్సరములు తపము

చేసి యెన్నిదినములకును దనమనోభీష్టము నెరవేఱనందునఁ దుదకు విసుకుజెంది వైరాగ్యమును బూని రాజ్యమంతయు విడిచిపెట్టి యరణ్యమునకుఁ బోవుచుండెను. అప్పుడు ధనలక్ష్మి ఘుల్లుఘుల్లున వచ్చి యెదుటనిలచెను. అప్పు డారాజు "ఆహా! నిన్ను గోరినంతవఱకు నీవు రావైతివి. నే నిప్పు డాశారహితుండను నీతో నాకవసరంబే" మని యడిగెను. అంతట ధనలక్ష్మి "రాజా నీవింతవఱకు భిక్షుకుఁడవు గాని యిప్పుడో నీవు నిజముగఁ జక్రవర్తివి. నేను బ్రపంచమంతయుఁ దృణప్రాయముగఁ జూచు మహానుభావుల నాశ్రయింతును గాని యాశాబద్ధు లగుదరిద్రుల చెంతకు రానొల్లనని చెప్పెను.

## 115 వ కథ.

పరిష్యాదేశమునందు 'సాదీ' యను నొక కవిశ్రేష్ఠుఁడు గలడు. ఒక నాఁటితెల్లవారుజామున సాదీయును నాతని తండ్రియును మసీదునకు వెళ్ళి దైవప్రార్థనలను గావించి తిరిగియింటికి వచ్చిరి. అప్పటికిని గొందఱుగురకలుపెట్టుచు

నిద్రించుచుండుట 'సాదీ' చూచినవాఁడై "తండ్రీ! వీరి మూర్ఖత్వమును జూడుము! ఇంతపెద్ద వారైననుగూడ భగవంతునారాధింపక పశువులవలె నించుకైనను జ్ఞానము లేక యెట్లు నిదురించుచున్నారు!" అని చెప్పఁగా దండ్రి "హా కుమారా యేమని పల్కితివి! నీవు వేకువజామున లేచి భగవద్ధ్యానముచేసి పరదూషణ చేయుటకంటెఁ నీవును వారివలె నింకను నిద్రించుటయే మేలు. భగవదారాధన చేయుటకంటెఁ బరదూషణయే యెక్కువ పాపము సుమా" అని హితోపదేశము చేసెను.

## 116 వ కథ.

రామతీర్థస్వాముల వారిచెంతకొకనాఁడు అమ్మహానీయుని మామ యేడ్చుచు, గుండెలుబాదుకొనుచు నతిదుఃఖముతో వచ్చెను. బ్రహ్మానందమగ్నుఁడైయున్న యాస్వామి యాతని దుఃఖమునకుఁ గారణ మడిగెను, అప్పుడాయన "అయ్యో! యిఁకనేమున్నది. కొంపకూలినది. వంశము నాశనమైనది. నీముద్దులబిడ్డ యాకస్మికముగ మృత్యువు పాలయ్యె

ను" అని చెప్పి వెక్కి వెక్కి యేడ్చుచుండెను. అప్పుడా మహానుభావుఁడు కొంచెమైనను చలించక యద్భుతశాంతముతో "ఆహా యిందు దుఃఖించుట కేమికారణమున్నది! గాలివీచుచున్నది. నీరు ప్రవహించుచున్నది. అగ్ని కాల్చుచున్నది. అని చెప్పి యేడ్చువారుందురా? పుట్టినవాఁడు చచ్చినాఁడని చెప్పుటయు నట్టిదేగదా ఇందాశ్చర్యమేమి?" అని పల్కి యూఱడించెను.

## 117 వ కథ.

ఒకనాఁడొకస్వామి వీథిలోఁ బోవుచుండఁగా నొకఁ మహమ్మదీయుఁడు చేతిలో నొకసారాయిబుడ్డిఁ బట్టుకొని యకేదారిని బోవుచు నాస్వామినిజూచి "స్వామీ జైలుకు మార్గమేద"ని యడిగెను. అంత నాస్వామి వానిచేత నున్న సీసాను జూపి "ఇదే జైలుకు మార్గ" మని చెప్పెను.

## 118 వ కథ.

పూర్వకాలంబున నొకరాజు గలఁడు. అతఁడు సదా యైహికసుఖములకు లోనై మదోన్మత్తుఁడై యుండెను.

ఆరాజు తనవినోదార్థమై కొందరు హాస్యగాండ్రను తనకడ నుంచుకొని వారితోఁ గాలము గడుపుచుండెను. వారందఱిలో నగ్రగణ్యుఁ డగునొకనికి బంగారుపతకము నిచ్చి దానిపై, అవివేకదామోదరశిఖామణి అని చెక్కించెను. ఇట్లుండ నొకనాఁడు రాజున కవసానకాలము సమీపించి, వ్యాధిగ్రస్తుఁడై పరుండి యవివేకదామోదరశిఖామణిని బిల్వనంపి కన్నీరు గార్చుచు “ఓమిత్రమా నేను బోవుచున్నాను” అనెను. అప్పు డాహాస్యగాడు లటాలున లేచి “స్వామీ గుఱ్ఱపుబగ్గీ కట్టించమందురా” యని అడిగెను. అంతట రాజు “ఓబుద్ధిహీనుఁడా నేను బోవుస్థలముకుఁ బండ్లమీదఁ బో”రని చెప్పెను. తిరిగివాడు “అట్లైనదేవా యేనుగ దెప్పించ మందురా” యనెను. రాజు వీనియజ్ఞానమునకు విసుకుచెంది “ఛీ మూర్ఖా యచటకు నేనుగపైఁ గూడ బో” రని చెప్పెను. అప్పు డాయవివేకి కొంచెమాలోచించి “అహా జ్ఞాపకము వచ్చినది. రాజా, పల్లకీతెప్పింతునా” యనెను. రాజువీని మాటలకు మిగుల నచ్చెరువు

నొంది "ఓబుద్ధిహీనుఁడా! యచటకు పల్లకిపైఁ గూడఁ బోవుటకు వీలుకాదనెను. ఈమాటల కాదామోదరశిఖామణి విస్మయము నొంది "ఓప్రభువర్యా, మీ కేమితక్కువ! మీరు నడచిపోవునంతటి గ్రహచారమేమి? అని తిరిగి యడిగెను. రాజు మరణావస్థయందున్నను వీని తెలివితక్కువకు నవ్వువచ్చి "ఓ పిచ్చివాఁడా నేనుబోవుచోటకు నడచిపోవుటకు సయితము వీలుండద"నెను. ఈమాటల కాహాస్యగాడు మఱింత యాశ్చర్యమును జెంది "రాజా, మీరు పోవుస్థలము వింతగా నున్నది. మీతో నేనుగూడ రావచ్చునా" యనెను. రాజు మిగుల కోపముతో "ఛీ! నోరు మూసుకొనుము. అక్కడకు నెవరికి వారేపోవలెను. కాని నీవునాతో నెట్లువచ్చెదవురా" అని యడిగెను. అంత నాయవివేకి ఇదేమి విచిత్రము! రాజా మీరు పోయెడిస్థలము బహువిచిత్రముగా నున్నది! అది దయచేసి యెద్దియో సెలవిండు" అని యడుగ నారాజు కొంచ మాలోచించి నేమియుఁ జెప్పఁ జాలక "నాకుఁ దెలియదు" అని చెప్పెను.

ఇట్లు చెప్పినతోడనే నాహాస్యగాడు తనబంగారుపతకమును వూడఁదీసి "రాజా దీనిని మీరే ధరించుట కర్హులు. ఇంత రాజ్య మేలుచు, నింద్రాదిభోగముల ననుభవించుచు మీజీవితములో మీరు తుదకెక్కడకుఁ బోయెదరో దానిని గూర్చి యించుకైనను విచారించ కుండుటకంటె నవివేక ముండునా? కనుక యవివేకదామోదరశిఖామణి యను బిరుదుకు మీరేతగుదురు గాని నేనుగాదనిచెప్పి వెడలిపోయెను.

## 119 వ కథ.

ఒకనాఁడొక బ్రాహ్మణుఁడు బుద్ధభగవానులను జూచి "సోమరివలె నీవు బిచ్చమెత్తి జీవించెదవేల? ఏదైన నొక వృత్తి చేసుకొనరాదా" యనెను. అప్పు డామహానుభావుఁ డిట్లు జవాబు చెప్పెను. "ఓ బ్రాహ్మణోత్తమా నేను దున్నితిని. విత్తునాటితిని. ఇప్పుడది ఫలించినది. దాని ననుభవించుచుంటిని నీవును నావలె దున్ని విత్తు నాటినయెడల నీకును మేరలేనియాహారము దొరుకును." అంతట నాబ్రాహ్మణుఁడు "నీయెద్దు లేవి, నీనాగలియేది, నీపాలమెక్కడ యేగింజలు

నాటితివి?" అని యడిగెను. అప్పుడమ్మహనీయుండు "నాహృదయమే పొలము, మనస్సే నాగలి, వివేకమే కొరడా, ఇంద్రియములే యెద్దులు, ప్రేమయే విత్తనము, పట్టుదలయే ఎరువు, భక్తియే వర్షము, నిత్యానందమే దీనిఫలము, అది నేను సదా యనుభవించుచుఁ దృప్తుఁడనై యున్నాను. నీవును నావలెఁ గష్టించి సంతృప్తుఁడవు కమ్ము" అని చెప్పెను.

## 120 వ కథ.

పరమభక్తుండును, దేశోద్ధారకుండు నగు 'మహమ్మద్' ఒకనాఁడు భగవంతునిదర్శనార్థమై స్వర్గమునకుఁ బోయెను. అప్పుడు స్వర్గద్వారము మూసియుండుటచేఁ దలుపు గొట్టెను. అంతట లోపలనుండి యొకశబ్దము "నీ వెవ్వడవు" అని వినవచ్చెను. అంతట నామహనీయుఁడు "నేను మహమ్మద్" అని యుత్తరవు చెప్పెను. ఇట్లు చెప్పినంతనే "పో పొమ్ము, నీవు నిచటకు వచ్చుటకర్హుఁడవుగావు" అని తిరిగి వినఁబడెను. అప్పుడు మహమ్మద్ కొంచె మాలోచించి

మఱియొకసారి తలుపు గొట్టెను. అంతట తిరిగి "నీవె వ్వఁడవని ధ్వని వచ్చెను. అప్పు డాభక్తుఁడు "దేవా నేను నీదూతను మానవులకు సన్మార్గమును బోధించి నీ నిజభక్తుల నుగా జేయుచుంటిని. నీపాదారవిందములను సేవించుటకై వచ్చినాఁడ" నని చెప్పెను. అప్పుడును "నీకు స్వర్గప్రాప్తి యింకను గలుగలే" దని శబ్దము వినవచ్చెను. మహాత్ముడు ఖిన్నుఁడై మఱియొకసారి తలుపు గొట్టెను. తిరిగి యాదే విధమున "నీ వెవ్వడవు" అని ధ్వని వచ్చెను. మహాత్ముడు "దేవా నీదాసాన దాసుండను" అని జవాబు చెప్పెను. తిరిగి "ఛీ పాత్మా, నీ విచటకు వచ్చుటకు అర్హుఁడవుగావు" అని వినఁబడెను. ఈసారి యాతఁడు తన మనోభీష్టము నెఱవేఱ నందునఁ చింతాక్రాంతుఁడై విచారించి విచారించి బాహ్య స్పృహతప్పి యింద్రియచలనము లన్నియు నుడిగి సంకల్ప శూన్యుండై సమాధిస్థయుండుఁ గొంతతడవు మగ్నుడై యుండి మహదానందమున లేచి తిరిగి యొకసారి తలుపు గొట్టెను అప్పుడును నదే విధమున "నీ వెవ్వడవు" అని

భగవద్వాక్యమును వినినంతనే "నేను నీవే" అని మహాత్ముఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఆతక్షణమే స్వర్గద్వారము తెరచుకొనెను.

## 121 వ కథ.

శంకరుఁ డొకనాఁడు తనయిద్దరు కుమారులగు గణపతి సుబ్రహ్మణ్యేశ్వరులను బిలచి "యిద్దఱిలోఁ బ్రపంచమంతయు ముందెవరు చుట్టివత్తురో వారికి మంచిఫలము నిత్తు"నని చెప్పెను. ఆతక్షణమే సుబ్రహ్మణ్యస్వామి తన నెమలి వాహనముపై నెక్కి వాయువేగమనోవేగంబులతోఁ బరుగిడుచుఁ బోయెను. గణపతి యూరక తండ్రిచెంతనే కూర్చునియుండెను. ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట సుబ్రహ్మణ్యము భూమిచుట్టును దిరిగి యతివేగంబునఁ దండ్రి చెంతకు వచ్చుచుండుటఁ జూచి గణపతి మెల్లన లేచి తండ్రిచుట్టును దిరిగి "తండ్రీ నేనే గెల్చితిని, ఫల మొసంగుము"ని యడిగెను అంత శివుఁడు, నవ్వుచు "బాలకా ప్రపంచమంతయుఁ దిరిగివచ్చిన సుబ్రహ్మణ్యమునకుఁ గాక

నీ కెట్లు వచ్చు" నని యడిగెను. అప్పుడు గణపతి "దేవా నేనొక్క ప్రపంచమునేగాక అన్నిలోకములు నయితము నీయన్నకంటె ముందుగాఁ దిరిగి వచ్చితిని. ఏలయనఁ సమస్తలోకములు నీయందే యున్నవి. నీకుఁ బ్రదక్షిణము చేయుట లోకము లెల్లఁ దిరిగినట్లే గదా" యని చెప్ప యాదేవదేవుఁడు మిగులసంతసించి ఫలమును గణపతికే యిచ్చెను.

## 132 వ కథ.

సకలసద్గుణసంపన్నుఁడై తపోనిష్ఠాగరిష్ఠుఁడైన యొక మునిపుంగవుని కొక శిష్యుఁడు గలఁడు. ఆశిష్యుఁడనుదినము తనగురువునకు మిగులభక్తిశ్రద్ధలతో నుపచారము చేయుచుండెడివాఁడు. ఇట్లుండ నొకనాఁ డొక పాతరయోగి యాశిష్యునిఁ జూచి "ఓయీ! నీ వెంతవెఱ్ఱివాఁడవు, గురువు నేమిచెలియు నని వాని నాశ్రయించితివి? వాఁడెందుకును బనికిరానికట్టె మొద్దు. నావలె వాఁడు నీళ్ళపై నడువఁ జాలఁడు. అట్టి తెలివిహీనుండగు పరమనీచుని నాశ్రయించి

నీకాలమంతయు వ్యర్థము చేయుచుంటివి గదా" యనిపలు కనాతఁడు మిగులశాంతవచనములతో "అయ్యా మీరు చెప్పిన మహిమలు నాకు చేయఁదన్నను, నంతకంటె వేయిరెట్లుత్కృష్టమైన మహిమ వారియొద్ద నుండుటచే వారి నాశ్రయించితి" ననెను. ఈమాటల కాయోగి యాశ్చర్యము చెంది "ఆహా యామహిమ యెట్టిదో కొంచము నాకుఁ జెప్పు మని కోపముగఁ బల్కెను. శిష్యుఁడు "అయ్యా గర్వము, పరదూషణ, క్రోధము మొదలగుదుర్గుణములు వారియొద్ద వెదకినను గాన్పించవు. ఇంతకన్న నెక్కువ మహిమ కలదా?" యని చెప్ప నాయోగి తనదుర్గుణంబులకు సిగ్గుపడి యూరకుండెను.

## 126వ కథ.

ఒకజ్ఞాని బజారునఁ బోవుచుండఁగాఁ బురజనులు జూడవచ్చిరి. కొందఱాయనకుఁ బట్టవస్త్రములఁ గప్పిరి. కొందఱాభరణములచే నలంకరించిరి. కొందఱు పూలహారములు వేయుచుండిరి. ఇదంతయు నాతఁడుచూచి

ఓహో! నిత్యకల్యాణస్వరూపుండగు భగవంతుని చేతుల కాభరణము లేల, కాళ్ళకు నగ లేల, యాదివ్యమంగళస్వరూపుని దేహమునకుఁ బట్టవస్త్రము లేల" యని నవ్వుచుం బల్కెను ఈవృత్తాంతమంతయు రాజునకుఁ దెలిసి "ఔరా, యాకపటసాధువు తాను భగవంతునిగా భావించుచున్నాఁడుగా! ఇట్టిఘోరపాతకునిశిరము వాఁడొకటనే ఖండించుఁడని యాజ్ఞాపించెను. తక్షణమే యాజ్ఞానిని బంధించి రాజుసాన్నిధ్యమున నిలువఁబెట్టి, తలారి ఖడ్గము పైకెత్తి తల నరుకఁబోవుసమయమున నాసాధువు "ఆగు ఆగు, రాజా మిమ్ముల కొన్నిప్రశ్నల నడిగెద. వాటికి బ్రత్యుత్తర మిచ్చి పిమ్మట మీపని కానిం" డని చెప్పెను. రాజందుల కంగీకరించెను. అప్పుడు సాధువు "రాజా! యీప్రపంచ మెవ్వరిది?" అనియడిగెను.

రాజు:— భగవంతునిది.

సాధు:— ఈసూర్యచంద్రాదు లెవ్వరివి?

రాజు:— భగవంతునివి.

సాధు:— ఈ యనంతకోటి జీవరాసు లెవ్వరివి?

రాజు :— భగవంతునివే.

సాధు:— ఈశరీరము లెవరివి?

రాజు :— భగవంతునివే. యందు సందేహ మేమి?

సాధు:— ఈచేతులు, కాళ్లు, మొదలైన యంగములెవరివి?

రాజు :— ఇవియును భగవంతునివే.

యనెను. అంత సాధువు “ రాజా నేనీమాటలు చెప్పినం దుకే గదా నాకుమరణదండన విధించిరి! ఇప్పుడు మీరు చెప్పినమాటలనే నే నంటిని గాని భగవంతుని నింద చేయ లేదే!” యనెను. రాజు తనయవివేకమునకు సిగ్గుపడి యాభ క్తుని పాదములపైఁ బడి క్షమాపణ వేఁడెను.

## 124 వ కథ.

ఒకనాఁడు రామతీర్థస్వాముల వారిపరిచారకుఁ డగునొక బాలుఁడు మేడపై నెక్కి “ నేనే పరమాత్మను, అంతా నేనే.” యని సంతోషమున నరచుచుండెను. ఈమాటలు వినిన యొక పెద్దమనిషి వానిమాటలకు నవ్వి “ఓరీ బాలకా

నీవే పరమాత్మ వైనయెడల నక్కడనుంచి క్రిందకు దుముకుము చూచెద"ననెను. అబాలుడు కొంచమైనను తడుముకొనక "ఓహో బ్రహ్మాండ మంతయు నేనే నిండియున్నాను. నేను లేని స్థలము చూపించినచో నచట దుమికెదను" అని చెప్పెను. అంత నాతఁడు పరమాత్మ లేనిదావు చెప్పుటను నిర్దేశించలేక సిగ్గుఁ జెంది వెడలిపోయెను.

## 135 వ కథ.

ఇద్దరు మనుజులు కలిసి యొకయూరికిఁ బోవుచుండిరి అందొకఁడు దైవభక్తుఁడు, రెండవవాఁడు నాస్తికుఁడు వారి మార్గమధ్యమున నొక దేవాలయము తటస్థించెను. అప్పుడు భక్తుఁడు లోపలకుఁ బోయి భగవంతుని ఇంచుక ప్రార్థించి తిరిగి వచ్చుచుండఁగా వాని కాలిలో ముల్లు గుచ్చుకొనుటచే కుంటుచు వచ్చెను. బయటనే కూర్చున్న నాస్తికునికి నొక వరహా దొరికెను. అప్పుడు నాస్తికుఁడు భక్తునిఁ జూచి "ఓయి బుద్ధిహీనుఁడా, చూచితివా? దేవుఁడఁట! దయ్యమఁట! నీభక్తికిఁ గలిగిన ఫలము కాలిలో

ముల్లు, నాభక్తిహీనతకుఁ గలిగిన ఫలము వరహా. నిజముగ భగవంతుఁడే యున్న నిట్టియన్యాయ మొండదుగదా? ఇక నైనను నీకిచ్చిభ్రాంతి విడచి నావలె నుండుము" అని చెప్ప నాభక్తునికిఁ గొంచెము మనసు కలవరపడి యను మానించుచుండగా నొకజ్ఞాని యటుబోవుచు వారింజూచి జరిగిన వృత్తాంత మంతయుఁ దెలిసికొని యాభక్తునిఁ జూచి "ఓయీ, నీవు పూర్వ జన్మంబున నొకగొప్ప నేరము చేసితివి. దానికిఁ బ్రతిఫల మిప్పుడు నీవు పాముచేఁ గరువఁ బడి చావవలసి యుండెను. కాని యీజన్మమందు నీకుఁ గలిగిన దైవభక్తి యడ్డమువచ్చి నీశిక్ష తేలిక యయ్యెను. పిమ్మట నాస్తికునిఁ జూచి "ఓయీ నీవు క్రిందటి జన్మమున నొక గొప్ప సత్కార్యము చేసితివి. అందులకు ఫలముగా నీ కిప్పుడు ధనరాసి ప్రాప్తము గావలసియుండ నీభక్తివిహీనత దానికి నడ్డము వచ్చి నీఫల మతిస్వల్ప మయ్యెను." అని చెప్ప భక్తునికి ననుమానము దీరి భక్తి వృద్ధినొందెను. నాస్తికునికి భక్తిబీజములు నాటెను.

## 126 వ కథ.

ఒక పరమహంస సమాధినిష్ఠుఁడైయుండ నమ్మహాత్ముని స్థితి నెఱుంగని యొక గృహస్థుఁ డాతనిం జూచి, "యోగివర్యా! మీరేల సకాలంబున సంధ్యావందనము చేయరు?" అని యడుగ నాతఁడు "ఓగృహస్థుఁడా, అజ్ఞాన మనెడి తల్లి చచ్చినది; సుజ్ఞాన మనెడి పుత్రుఁడు పుట్టినాఁడు. ఇట్లు సూతకము, పురుడు రెండు నొకటేసారి సంభవించి యుండగా సంధ్యావందనము చేయుట కెట్లఁగును? అని యుత్తర మిచ్చెను.

## 127 వ కథ.

ఒకానొక స్థలమందుఁ బ్రతిదినమును వేదాంతులు గూడి పరమార్థమునుగూర్చి చర్చించుచుండెడివారలు. ఇట్లుండ నొకనాఁ డాగ్రామమున కొకమహనీయుఁడు వచ్చె నను సంగతి తెలిసి యావేదాంతు లందఱును వారిని దర్శించుటకై బోవ యత్నించుచుండఁగా నచటఁ బంజరము నున్న చిలుక చక్కఁగా మాటలాడుట నేర్చిన దగుటచే నొక

వేదాంతిని బిలచి "యయ్యా మీరమ్మహనీయునిఁ జూచిన ప్పుడు నాకీబంధమునుండి విముక్తి యెట్లగునో తెలుసుకొని రమ్మని" వేఁడుకొనెను. అట్లే యావేదాంతి యామహాపురుషుని చెంతకుఁ బోయెను. అప్పు డాయన నదిలో స్నానము చేయుచుండఁగా "స్వామీ పంజరములోనున్న చిలుకకు బంధవిముక్తి యెట్లగు" నని యడిగెను. ఆమహానుభావుని చెవికి నామాటలు సోకినంతనే తిరిగి మాట్లాడక గభాలున నీట మునిఁగి శవమువలె ప్రవాహములోఁ గొట్టుకొని పోయెను. ఈయుపద్రవమున కావేదాంతి యాశ్చర్యపడెను. మిగిలినవా రందఱు నామహానుభావుని మరణమునకీవేదాంతియే కారణమని వానిని దిట్టసాగిరి. పాపమా వేదాంతి ఖిన్నుఁడై యింటికిఁ బోయెను. ఇల్లు చేరినంతనే చిలుక "అయ్యా నాప్రశ్న కేమి జవాబు చెప్పినార"ని యడిగెను. అప్పు డాతఁడు "అయ్యో! యేమని తెల్పుదును. నీపాడుప్రశ్న యడిగినంతనే యామహనీయుఁడు మృతి నొందెను." అని యిట్లు పలికినతోడనే చిలుకగిర

గిర్రఁ దిరిగి నిస్పృహమై క్రిందఁ బడెను. ఈయద్భుతమును జూచినవా రందఱు మిగుల నాశ్చర్యమును జెంది యేమి యుఁ దోచక చచ్చినచిలుకను బంజరమునుండి తీసి యావల విసరి పారవేసిరి. అట్లు పారవేసినంతనే చిలుక బుఱ్ఱున నెగిరి యొకవృక్షాగ్రమునఁ గూర్చుండి “ఓమతి హీనులారా! మీరిన్ని దినములనుండి వేదాంతశ్రవణముఁ జేయుచున్నను, బంధవిముక్తికి మార్గమును గ్రహింపఁ జాల రైరి. ఆమహానీయుఁడు చచ్చెనని మీరు తలఁచుచున్నారు. అయ్యో! మీ రెంతవెఱ్ఱివారలు! నాప్రశ్నకు వారు చెప్పిన యుత్తరము వారు నాచరించియే చూపిరి. మీ రెన్నిదిన ములు వేదాంతశ్రవణము చేసినను, యెందఱి మహనీయుల దర్శించినను, నెన్నిదేవతలకు మ్రొక్కినను బ్రతికియుం డియు నెవఁడు ప్రపంచమునకుఁ జచ్చునో వాఁడే జరామ రణము లనెడి బంధములనుండి తప్పించుకొని యావంద మతో నిష్టను నావలె స్వేచ్ఛను గాంతురని హితోప దేశము చేసి యాకాశముపై నెగిరి పోయెను

## 128 వ కథ.

ఒకసాధువు సర్పముచేఁ గఱవఁబడి మరణావస్థయం దుండఁగా నాతని శిష్యులు "గురువర్యా! అయ్యో, యీ పాడుపాము మీకు మృత్యు వయ్యెఁగదా! మీయోగబలముచే దానివిషమును హరింపఁ జేయ రాదా" యని యడిగిరి. అంతట నాభక్తుఁడు "శిష్యులారా, జగన్మాత, నన్ను దక్షిణమే యామె సాన్నిధ్యమునకు రమ్మని సర్పముచే వార్తఁ బంపి యున్నది. మాతల్లియాజ్ఞను నే నుల్లంఘించను" అని చెప్పి యానందమునఁ గన్నులు మూసుకొని ప్రాణములు విడచెను.

## 129 వ కథ.

ఒకానొక మనుజుండును వానిభార్యయు విరాగులై యరణ్యమునకుఁ బోవుచుండిరి. ఇట్లు పోవుచుండఁగాఁ ద్రోవలో నొకనవరత్నఖచిత మగు నాభరణము భర్తకుఁ గాన్పించెను. వెంటనే యాతఁడు దానిం జూచి "అహో! యిది నాభార్యకంటఁ బడినయెడల దీనిపై నాశ గలుగ

వచ్చు నని దానిపైఁ శాలితో మట్టి వేసెను. ఇదంతయుఁ జూచు చున్న యాతనిభార్య "ఆహా! మీ రేమి చేయు చున్నారు, చెప్పు" మని బ్రతిమాలుకొనెను. అంతనా తడు దాచుటకు వీలు లేక తాను జేసినకార్యమును చెప్పెను. అప్పుడామె నవ్వుచు "ఆహా మీరు తిరిగి యింటికిఁ బోవచ్చును. మీ కింకను వైరాగ్యము కలుగలేదు. నిజమైన విరాగికి మన్నను బంగారము నొకటిగానే గోచరించును. ఇట్టి భేదబుద్ధి మీకుఁ బోకముందే సంసారము నేల త్యజించితిరి" యని చెప్పినంతనే నాతఁడామె వైరాగ్యమునకును, బుద్ధికుశలతకును మిగుల సంతసించెను.

## 160 వ కథ.

కర్ణునితో సమానమైనదాత లేఁడని ప్రపంచమంతయుఁ బొగడుచుండ దుర్యోధనుఁడు సహింపఁ జాలక యాతనికన్న నెక్కువపేరు సంపాదించ వలెనని, కర్ణుని వలె దానము దానకంకణము గట్టుకొనెను. సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణభగవానులు దుర్యోధనుని బరీక్షింపఁదలఁచి యొక

బ్రాహ్మణవేషము దాల్చి వానిచెంతకుఁ బోయి దాన మడిగెను. అప్పు డా రాజు "ఓభూసురోత్తమా మీకు ద్రవ్యముగాని, యిండ్లుగాని, భూములుగాని యేమి కావలె నన్నను నిచ్చుటకు సిద్ధుఁడనై యున్నాను. మీ కేమి కావలయునో సెల వొసంగుఁడు" అని వినయవిధేయములతో నడుగ నాబ్రాహ్మణవేషధారి "రాజా నా కేమియు నవసరములేదు. నే నొకక్రతువును జేయ సంకల్పించినాను. ఆనాఁటికి నాకుఁ గావలసిన కట్టెపుల్లలుమాత్రము దయచేసినచో నదే మహాభాగ్య" మని విన్నవించినంతనే దుర్యోధనుఁడు "ఓహో, యెంతస్వల్పకోరిక గోరితివి! అట్లే కానిమ్ము" అని చెప్ప యాబ్రాహ్మణుఁడు వెడలిపోయెను. పిమ్మట సర్వశక్తుం డగుశ్రీకృష్ణుఁడు పదిహేనుదినములహోరాత్రములు కుంభవర్షము గురిపించి యెచ్చటను నొక్కయెండుపుల్లయైన లేకట్లుచేసి దుర్యోధనునికడకుఁ జిరిగి బ్రాహ్మణవేషముతో బోయి "ఓ మహారాజా, నేనడిగిన కట్టెపుల్లలు దయచేయుఁ" డని యడిగెను. అప్పుడు

దుర్యోధనుఁడు విస్మయముఁ జెంది "ఓబ్రాహ్మణోత్తమా, గడచిన గొప్పవర్షములచే నెచ్చటను యెండుకట్టెయే లేదు. మీకుఁ గావలె నన్న నెంతధనమైన నిచ్చెదను. లేక కొన్నిరోజులు మీక్రతువును నిలిపినచోఁ బిమ్మట మీ కెంత కలపనైన నిచ్చెదను" అని చెప్పినంతనే యాబ్రాహ్మణుఁడు 'ఓహో రాజా నీ వేమీ మహాదాతవని విని నీచెంతకు వచ్చితిని. నీమాటలునమ్మి క్రతువుచేయుట కిప్పుడు సమకూర్చుకొంటిని. కట్టెపుల్లలే యివ్వజాలక నాక్రతువుగూడ నిలుపుకొమ్మని సలహాయిచ్చుచుంటివి. చాలు చాలు నీచేత కానిచోఁ గర్ణునిచెంతకే పోయెదను" అని చెప్పి తిరిగి పోయి కర్ణునియొద్దకేగెను. కర్ణుడు వీనికోరికవిని కొంచమాలోచించి సేవకులను బిలచి తనదివ్యభవనమును కొంత నూడఁదీయించి యందలి విలువగల కలపనంతయు నాబ్రాహ్మణుని కిచ్చి పంపెను. ఆబ్రాహ్మణుఁ డాకలపనంతయుఁ బండ్లపై నెక్కించి దుర్యోధనుని యింటిముందరగాఁ బోవుచుండ దుర్యోధనుఁ డాశ్చర్యముచెంది ఆహా, నిజముగఁ

గర్జునకేదారిశబ్దము చెల్లును గాని నావంటివానికిఁ గాదు" అని సిగ్గుఁ జెచ్చుకొని తాను గట్టుకొనిన దానకంకణమును దీసివేసెను.

## 131 వ కథ.

ఒకగ్రామములో నొకబీదవాఁడు కలడు. వాఁడొక చిన్నగుడిసెలోఁ దనయాలుబిడ్డలను దనకష్టార్జితమువల్ల బోషించుచు సుఖంబునఁ గాలముఁ గడుపుచుండెను. ఆగుడిసెకు సమీపముననే మిక్కిలిసౌందర్యమైన యొక భవనమును నిర్మించి యందుఁగాపురము చేయుచున్న యొకధనికుఁడు కలడు. ఆధనికున కొకప్పుడును మన శ్శాంతి లేకఁ యొద్దియో యొక కలవరముగలిగి సంతోష మన నెట్టిదో నెఱుగనివాఁడై యుండెను. ఇట్లుండ నాగ్రామమున కొకసన్యాసి వచ్చెను. అప్పు డాధనికుడు ఆయనను దర్శించి "స్వామీ, భగవంతుడు నాకన్నివిధ ముల పూర్ణమైన నైశ్వర్య మిచ్చినను ఆదరిద్రున కున్న మన స్థిమిత కు నాకు లేదు. వాని ముఖమం దెప్పుడును సంతో

మను తాండవమాడుచుండును. ఇందుకుఁ గారణ మేమని యడిగెను. అప్పు డాసన్యాసి "ఓయీ నీమనశ్శాంతిని భంగము చేయుచున్నది నీధనమే" యనెను. అంత నాభికుఁడు ఆశ్చర్యము జెంది "ఆహా సమస్తసౌఖ్యములు ధనముచేతనే లభించుచుండగా నాసౌఖ్యభంగమునకు ధనమెట్లు కారణమగును? ఇది వింతగా నున్నది. నాసందేహము దీర్చు" డని యాసన్యాసిని యడిగెను. అంతట వారిద్దరును యా పేదవాని గుడిసెకుబోయి వానికి దెలియకుండ నొక గుడ్డకు 99 రూపాయలనుగట్టి గుడిసెలో బడవేసిరి. ఆమరునాడు తిరిగి వారిద్దరును యాగుడిసెకుఁబోయి వానిని జూచిరి. ఆబీదవానిముఖము వాడిపోయి సంతోషహీనమై విచారగ్రస్తమై యుండెను. అందులకు కారణమేమని సన్యాసి వానినడుగ వాడు అయ్యా నాకు నిన్నటిదినమున ఒకసంచి దొరకినది. అందు 99 రూపాయలు మాత్రమే యున్నవి. నూటికి ఒక్కటితక్కువగా యుండుటచే వానిని గూడ పూర్తి జేయ వలెనని మేమందరము నిన్నటి

నుండి వస్తుంటిమి. ఈకారణముచే నాముఖము వాడియు న్నది. మఱియు ఈరూపాయలను ఎక్కడైన దాచినచో దొంగ లపహరింతురేమో ననియు నెవరికయిన అప్పిచ్చి నచో తిరిగి యివ్వరేమో యని జిజ్ఞాసయు నాపిల్లలు యీధనమంతయు తమకే యివ్వమని బాధించుటచే దుఃఖ మును పొంది యున్నా నని చెప్ప యాధనికుని సందేహము తీరెను.

## 132 వ కథ.

జర్మన్ దేశస్థుడును తత్వవేత్తలలో నగ్రగణ్యుండు నగు "క్యాంటు" అను నాత డొకదినమున నాత్మవిచారణ యందు మగ్నుడై మార్గమున బోవుచుండ తనచేతికఱ్ఱ యొక పెద్దమనిషికి తగిలెను. అంత నాతడు "క్యాంటు" ను జూచి కోపముతో "ఓయీ నీ వెవరు?" అని ప్రశ్నిం చెను. అంత క్యాంటు చిరునవ్వుతో నీవు నన్నడిగిన ప్రశ్నకు నీవే సదుత్తరము చెప్ప గలిగినయెడల నీభూమండల మంతయు నే నెట్లయిన నార్జించి నీకు బహుమాన మొసం గెదను" అని చెప్పెను

## 133 వ కథ.

ఒకపిల్లవాడు మరియొకపిల్లవానితో "నీవు దేవుడున్న స్థలము చూపించినయెడల నీ కొకపండు నిచ్చెద" నని చెప్పెను. రెండవపిల్లవాడు "నీవు దేవుడు లేనిస్థలము చూపించినచో నీకు రెండుపండ్లు నిత్తు నని" జవాబు చెప్పెను.

## 134 వ కథ.

పూర్వకాలమున ఒకమనుష్యుడు మఱియొకనికి కొంత భూమి నమ్మెను. అతడు దానిని త్రవ్వుచుండగా ధనముతో నిండిన రెండుబంగారుకలశములు దొరికెను. వెంటనే వాడు యాకలశములను దీసుకొని తనకు భూమి నమ్మినవాని యొద్దకు వెళ్ళి "అయ్యా మీరు నా కమ్మినభూమిలో యీద్రవ్యము దొరకినది. ఇది మీదే గనుక దీనిందీసుకొను" డని చెప్పెను. అంత నామనిషి "అయ్యా నాభూమిని మీ కమ్మిన పుడే అందుండెడిధనముసహా మీదేగాని నాదె ట్లగును? గనుక దానిని మీరే దీసుకొం"డని తిరిగి యిచ్చె

వేసెను. గాని యాతడు "ఓహో యి దెక్కడియన్యాయము మీరునాకు భూమినే అమ్మితిరిగాని అందుండెడి ధనము నమ్మలేదు గదా. ఇట్టి పాపకృత్యమునకు నేనొడిగట్టుకొనను" అనిదానిని తిరిగివానికేయిచ్చెను. ఇట్లీయిరువురు వివాదములాడుచు ధర్మరాజు చెంతకు బోయి చెప్పుకొనెను. ఆరాజు యిద్దరిని తృప్తిచేయు జాలక సర్వజ్ఞుడగు శ్రీకృష్ణుని సాన్నిధ్యమునకు బంపెను. అంత నామహానుభావుడు వీరిద్దరి వివాదము విని "మీకొకసంవత్సరము గడువు బెట్టితి. అంతవరకు నీరెండుకలశములను చెరియొకటి భద్రముగా గాపాడి సంవత్సరాంతమునకు తిరిగి నాయొద్దకు వచ్చినచో మీకు న్యాయము చెప్పెద నని చెప్పి పంపివేసెను. ఇదంతయు జూచుచున్న ధర్మరాజు ఆశ్చర్యము జెంది 'కృష్ణా నీవు మహానుభావుడ వని వారిని నీయొద్దకు బంపితిని, వారికి హిత వగు తీర్పును చెప్పి యిద్దరిని సంతోష పరచక యీాస్వల్పకార్యమునకు సంవత్సరము గడువుబెట్టితివి. ఇంతమాత్రము నేను చేయ లేక

పోలినా" యని పరిహసించెను. అంత శ్రీకృష్ణుఁడు చిఱున గవ్వుతో « ధర్మరాజా నేను వారివివాదము పరిష్కరించి తిని. వారు మరల మనవద్దకు రారు" అని చెప్ప నారాజున కేమియు నర్థముగాక దానిని వివరించి చెప్పుమనెను. అప్పుడు కృష్ణుఁడు « రాజా ఆబంగారు కలశముల నిద్దరికి చెరియొకటి నిచ్చి భద్రముగా నొకసంవత్సరము కాపాడు డని చెప్పియుంటిని. ఆట్లొకసంవత్సరము ఆధనమును తమయొద్దనే యుంచుకొనుటచే కొంతకాలమునకు సాంగత్యదోషము వాటిల్లి వారిద్దరికిని దానియందు ఆశగలిగి దక్కినదే చాలు నని సంతోషించి న్యాయస్థానమునకు బోయిన అదికూడ పోవునేమో యని భీతిచే యూరక యుందురు" అని చెప్ప ధర్మరాజు శ్రీకృష్ణుని యపారజ్ఞానమున కచ్చెరువు నొందెను.

## 135 వ కథ.

ఇంగ్లాండు దేశమునందు న్యూటన్ అనుతత్త్వవేత్త తన స్నేహితు నొకనిని భోజనమునకు బిలచి, ఆసంగతి తనయింట నుండు

వారికి చెప్పుటకూడ మరచి తత్వవిచారణయందు మగ్నుడై యుండెను. పిమ్మట వానిస్నేహితుడువచ్చి యాతత్వవేత్తకు భంగము కలుగునేమో యని పిలువక నే అతనికడ్డ బల్లపై నమర్చియున్న యాహారమును భుజించి వెళ్ళిపోయెను. పిమ్మట కొంతసేపటికా తత్వవేత్త స్పృహకువచ్చి బల్లమీదనున్న యుత్తపళ్లెమును గిన్నెను, పండ్లతోళ్లను జూచి, అహా నేను భుజించినసంగతియే నాకు తెలియలేదు! ఈదృష్టాంతమువలెకూడ లేకున్నచో నేనింకను భోజనము జేయలేదనే యూహింతుగదా యని కడుపునిండిన వానివలె సంతసించి తిరిగి ధ్యానమగ్నుడైయుండెను.

## 186 వ గథ.

ఒకరాజుభార్య చాలదైవభక్తిగలిగి సకల సద్గుణసంపన్నురాలై యుండెను. ఒక్కసారియైన నోట "రామా" యని యుచ్చరించనియామెభర్తను ఎటులైన భక్తివంతునిగా జేయు వలెనని యెన్నివిధముల భోధించినను నిష్ఫలమై మిగుల చింతించుచుండెను. ఇట్లుండ నొకనాడు రాజు

నిద్రబోవుచు 'రామా' యని నెమ్మదిగ కలువరించెను. అప్పు డా సాధ్వీమణి మహానందంబునొంది అహా నేటికిగదా నేను ధన్యురాల నైతిని అని మిగులసంతసించి మరునాడు పట్టణమంతయు నలంకరింప జేసి పేదలకు అన్నవస్త్రము లనిచ్చి విశేషధనమును దానము జేసి గడువైభవముల జరుపుచుండగా రాజు యిందులకుఁ గారణము దెలియక భార్యకృత్యముల కాశ్చర్యమొంది యామెను దానికి గార ణము జెప్పుమని యడిగెను. అంత నా పతివ్రతాతిలకము 'నాథా, యిన్నిదినములకు మీనోట భగవన్నామమును, వినగల్గితిని. ఇంతకన్న నాకు బరమానందమేమున్నది, ఇది యేకారణము" అని చెప్పెను. ఇది వినినంతనే రాజు విస్మ యము జెంది "నే నేమని బల్కితి! యెప్పుడు బల్కితి! నని యడిగెను, అంత నామె "నాథా మీరు నిద్రించుచు రామా యని కలువరించితిరి" అని యనినంతనే రాజు "అయ్యో యెన్నిసంవత్సరములనుండియో మిగుల భద్రము, గ నాహృదయకమలమునందు దాచుకొనిన నామూల్యధనము

వల్లడి యయ్యె గదా యని ప్రాణములువిడిచెను.

## 187 వ కథ.

కొన్ని సంవత్సరములక్రిందటనే గుంటూరుపురమున కొకది గంబరిగానున్నయోగిని యెచ్చటనుండియోవచ్చి బజారున బోవుచుండగా ఒక రాచకీయయుద్యోగస్థుడు చూచి యామెను కారాగృహమున బెట్టించెను. అప్పుడమ్మహనీయురాలిని దర్శించుటకై వెళ్ళినవారొకరు “అమ్మా మీ రేల బట్టకట్టరు? అని ప్రశ్నించెను. అందు కామె నేను బుట్టినపుడే చర్మవస్త్రమును ధరించి వచ్చితి. దీనిపైమరియొకవస్త్రమేల?” నని చెప్పెను. అంత వారుతిరిగి “అమ్మా మీరిట్లుండదలచినచో నడవులలో నుండవలెను గాని పట్టణములకు రా కూడదు” అని చెప్ప నాదిగంబరి “నేనిప్పుడు ఘోరారణ్యమం దున్నాను. మీరు చెప్పినయడవులలో నుండుయడవిమృగములు నన్నేమియు బాధించక నాతో మైత్రి గలిగియుండెను. గాని యీప్రదేశమున నన్ను గారాగృహమున బంధించి విచ్చుకత్తులతో పహరానిచ్చుచున్నారు

నే నొకరినిబలుకరించ లేదు. ఒకరిని దూషించ లేదు. నాత్రోవను నేను బోవుచుంటిని, యిట్టినిరపరాధులను బాధించు ప్రదేశము ఘోరారణ్యముకంటె యెక్కువయే గదా!" యని జవాబు చెప్పెను.

## 138 వ కథ.

ఒకనాడు రామతీర్థస్వామి అమెరికా దేశమునందుపన్యసించుచు రాచకీయ విషయములనుగూర్చి అధికముగ ప్రసంగించెను. ఆసభయందు న్యాయాధికారులును, న్యాయవాదులును, యింక గొప్పగొప్ప లుద్యోగములలోనుండు అనేకులును గలరు. ఉపన్యాసాంతరమందు న్యాయాధికారులు స్వాములు వారిచెంతకు వచ్చి "స్వామీ, మీ రిట్టి విషయములను యిక ముందెన్నడును ప్రసంగించవలదు ఏలయన నీదేశచట్టముల ప్రకారము మిమ్ము చెరసాలయందుంచుటయో, లేక నురిదీయుటయో సంభవించును. ఇది మీయొక్క శ్రేయస్సునుగోరి పలుకుచున్నార" ని హితవు జెప్పిరి. అంత రామతీర్థులవారు "ఓదయానిధు

లారా, ఈదేహ మేమైననుసరే సత్యమునే ప్రకటించెదను. ఇప్పటివరకు నన్ను (ఆత్మను) ఛేదించగల్గిన ఖడ్గము చేయబడలేదు. వేయేల, యించుకైనను నాకు హానిచేయగలుగు ఆయుధ మింకను పోతబోయ బడలేదు. నాకుపుట్టుక లేదు. చావు లేదు. భూతభవిష్య ద్వర్తమానములం దొక్కరీతిని యున్నవాడను. నాకు భయ మేల" యని ప్రత్యుత్తర మిచ్చెను. అంత వారు స్వాములవారి ధైర్యసాహసములను స్వార్థపరిత్యాగమును గొనియాడుచు మరలి పోయిరి.

## 139 వ కథ.

## రాధాకృష్ణ సంవాదము.

రా:—కృష్ణా, నీఅసత్యములకు మేరలేదు. ఆహా! ఇట్టి యసత్యప్రపంచము నొకదానిని గల్పించి మనుష్యుల నెంతమాయబుచ్చుచున్నావు.

కృ:—నిజమే. నేను అసత్యవంతుడనే యనుకొనుము. గాని నాఅసత్యమును అసత్యముగా నెవరుదెలిసికొందురో వారికీఅసత్య ప్రపంచమంతయు మాయమై సత్య

స్వరూపుడ నగు నే నొక్కడనే గాన్పింతును సుమా.

రా:—అది యటుండ నిమ్ము. నీవు మోసగాడ వనియైన నొప్పుకొనెదవా లేదా? నీవును నేనును నిజమున నొక్కటే యైనను నీకును నాకును భేదముగఁ గల్పించితివి గదా? యిక నీవు మోసగాడ వని యనుటకు సందేహ మున్నదా?

కృ:—నిజమే నేను మోసగాడనే యనుకొనుము. గాని యెవరు తానును నేనును వేరని భావించునో యట్టి వారికి మాత్రమే నేను వేరుగా గాన్పింతును, గాని తానును నేనును ఒక్కటే యని భావించువారికి యొక్కటిగానే యుందును. ఇందు నాతప్పేమి?

రా:—నిజమే, నీయందు దేతప్పును లేదు. గాని దొంగ తనముమాత్రము పూర్తిగా గాన్పించుచున్నది. నీవంటి దొంగయే లేదు. మనుష్యులజ్ఞాన నేత్రమునందు మాయ యనుమందు జల్లి వారియానంద మనుద్రవ్యము నపహ రించి వారినిదుఃఖములపాలు జేయుచుంటివి? ఇంతకన్న

దొంగతన మేమి? ఇది యైన నొప్పుకొనెదవా?

కృ:—సత్యము బల్కితివి. నేను దొంగనే యనుచున్నావు గాని వేదములునన్ను "తస్కరాణాంపతిః" యని దొంగలరాజాపహితము వర్ణించుచున్నవి. గాని నేను చేయుదొంగతనము అందరివలెనే గాదు ఎవరు అజ్ఞాన మనెడినిదురలోబడి తా మెవ్వరైనది మరచి నిద్రించుచుందురో అట్టి వారిని మేల్కొలుపుట కెంతయో ప్రయత్నింతును. అప్పటికిని వారు లేవనియెడల వారిధనమును అపహరించుచుందును. ఇందుమాత్రము నాతప్పేమి?

రా:—కృష్ణా, నీ కేమి మాటలురాని వాడవా? అన్నిటికి నన్ని సమాధానములు చెప్పుచున్నావు, కాని నీవు మిక్కిలి క్రూరుడవు సుమా! నిన్ను దయాస్వరూపుడవని యెట్లు బలికెదరో తెలియదు! పిల్లికి చెలగాటము యెలుకకు బ్రాణసంకటము అనునట్లు నీలీలయంతయు హింసామయముగదా. ఆహా! నీవెంతటికఠినాత్ముడవు!

కృ:—రాధా, నిజముగ నేను కఠినాత్ముడనో లేక దయా స్వరూపుడనో యోచించి చెప్పుము! అందరియందును ఆత్మస్వరూపముగ నున్న నన్ను కొంచమైన హింసయు నితలపక లోతుగ బూడ్చి మట్టి గప్పి నన్ను దలుపనైన దలపకున్నారు. వారంతకఠినులైనను నేనుమాత్రము యెవరిని విడనాడక యెవరికి గావలసినది వారికిచ్చుచు తుదకు నాయందు లీనము చేసుకొనుచున్నాను.

రా:—కృష్ణా, నీయుక్తుల కేమి గాని, నీయంతవ్యభిచారి లేడుగదా! నీప్రియురాండ్రసంఖ్యకు మితమున్నదా? ఇదియైన నొప్పుకొనెదవా?

కృ:—రాధా, నాయందెన్నిదోసము లెంచుచుంటివి! నీవారోపించిన యీనిందయు సత్యమే. ప్రతిజీవాత్మయు నాప్రియురాలే. నాప్రియురాండ్రతో అనేక విధముల సరస సల్లాపములాడుచుందును. కొన్ని సమయముల నేను మగుగాను, కొన్నిసమయములు నేను వేరుగను కొన్ని సమయముల ఒకటిగాను యిట్లనేక

విధముల లీలావినోదములు సల్పుచుండు నేమ నా ప్రియురాండ్రను యెప్పటికిని భేదభావములేక నొక్కటిగానే యుందుము.

రా:—కృష్ణా, జగన్నాటకసూత్రధారుండ వగునీకు సమాధానము చెప్పలేను గాని మఱియొక్క సందేహము మాత్రము దీర్చుము. నీవు పక్షపాతివిగా నాకు గాన్పించుచున్నావు. ఇదియైనను సత్యమేనా?

కృ:—రాధా, నేను పక్షపాతకుడ నని తలచువారికి నటుల నే గాన్పింతును, గాని నేను మాత్రము పిపీలికాదిబ్రహ్మ పర్యంతము గలఅనంతజీవకోటిని ఒకేవిధమున కాపాడుచు రక్షించుచున్నానుసుమా, న్యాయం చెప్పటికి తప్పు లేదు.

రా:—కృష్ణా, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుం డగు నీయట్టి మహామహుని కృత్యములు అవాఙ్మానసగోచరంబు గదా! నీదాసానదాసుల పాదరేణువున కైనను బోల్పదగని నావంటి యసమర్థురాలు నిన్నెంచుటకంటె

మౌనము ధరించి మునులవలె గూర్చుండుటయే మేలు" అని చెప్పి యూరకుండెను.

## 140 వ కథ.

హెర్బర్టుస్పెన్సరు అను నొక ఇంగ్లాండు దేశస్థుండెను. అతను మహాజ్ఞానసంపన్నుడును, సకలవేదాంతరహస్యతత్వవేదియునై యుండెను. ఒకనాడొకవిద్వాంసుడు ఆయనతో " అయ్యా మీజ్ఞానవికాసము అపారపారావారముగా నున్నది. మీకింతజ్ఞానసంపత్తి గలుగుట కెన్నిగ్రంథములు జదివితిరో! యని ఆశ్చర్యముగ బలికెను. అంత నాతత్వవేత్త నవ్వుచు "నేవిసేనగ్రంథములను జదివినచో జ్ఞానహీనుడను గాకే యుందును. సృష్టి యనెడి బ్రహ్మాండగ్రంథమును నేకదా పారాయణచేయుచుండుటచే నాకీజ్ఞానవికాస మయ్యె" నని జవాబు చెప్పెను.

## 141 వ కథ.

మిక్కిలి ధనవంతుడును పరమలోభియు నగువొకమనుష్యుడు తనద్రవ్యమునంతయు రాసులురాసులుగా పెట్టల

పెట్టి భూమిలో బూడ్చుచుండెను. ఇదంతయును జూచు చున్నవొక సన్యాసి అందులకు గారణమడిగెను. అప్పుడా ధనికుడు "ఎప్పు డెట్టియవసరమువచ్చునో సెవరికి దెలి యును? యెంతెప్పుడైన మిక్కిలియవసరము గలిగినప్పుడు ఉపయోగపడుటకై ధనముదాచుచున్నానని చెప్పెను. అంత నాసన్యాసి మారు పలుకక వెడలిపోయి మరునాడా ధనికుని తనమఠమునకు వచ్చునట్లు జేసెను. అప్పుడా సన్యాసి మిక్కిలిప్రయాసతో పెద్ద పెద్దరాళ్లను దెచ్చి యొక పెద్దగోతిలోవేసి బూడ్చుచుండుటజూచి ఆశ్చర్యము జెంది "స్వామీ, మీరేల యిట్టివిపరీతపు గార్యము జేయు చుంటిరి" అని యడిగెను. అంత నాసన్యాసి, నాకెప్పు డెట్టి యవసరమువచ్చునో, ఏమకష్టములు గల్గించ వలెనో నెవరికి దెలియును! ఎప్పు డేప్రళయమైనను, మరేయుపద్రవ మైనను వచ్చి యూళ్ళుకొండలన్నియు గొట్టుకుపోవునేమో నని రాళ్లను భద్రముగా దాచుచుంటి నని చెప్పెను. అంత నాధనికుడు పకపక నవ్వుచు, ఆహా యేమి విపరీతము

రా? నావంశీయులందరు అనేకతరములనుండియు చక్రవర్తులుగానే యున్నారుగాని యిటులె సన్యాసిగా నొక్కడును లేడు. ఈదేశము దీని మానమర్యాదగాపాడుము అని చెప్పెను. మహానుభావుండగు బుద్ధభగవానులు చిరునగవుతో॥ రాజేంద్రా, అట్లుకాదు నీవంశీయులందరును చక్రవర్తులేగాని నావంశీయులందరును అనేకతరములనుండియు సన్యాసులుగానే నాదివ్యదృష్టికి గోచరించుచున్నది. నీవును నేనును జీవయాత్రలో వేరువేరుమార్గముల బోవుచు అనేకుల గర్భములబుట్టుచు జచ్చుచు యీజన్మమున ఇక్కడ గలసితిమి. తిరిగి నీదారిని నీవును, నాదారిని నేనును బోవలసినవారలమేగాని వేరుకాదు" అని ప్రత్యుత్తరమిచ్చెను.

## 143 వ కథ.

ధృవుడను రాజకొమారుడు తన తండ్రికంటె నధికరాజ్యమును సంపాదించవలెనని ఘోరారణ్యమునకేగి యేకాంతమున నిశ్చలమనస్కుండై యనేక సంవత్సరములు తప

మాచరించుచుండెను. ఇట్లుండ గొంతకాలమునకు గామితార్థప్రదాయకుండగు భగవంతుడు ప్రత్యక్షమై "ఓ కుమారా, నీభక్తికి సంతసించితిని. నీకేమికావలయునో కోరుము" అని పలుక నాభక్తాగ్రేసరుండు "హేదేవా, నాకేకోరికయులేదు. నేను వాంఛాశూన్యుండను" అని చెప్ప భగవంతుడు "ఏమీ, ఏకోరికయే నీవుమరచితివా, యెవరును కన్నను మిన్నగారాజ్యాధిపత్యము గోరిగదా నీవు తపమాచరించుచుంటివి! కాన నేకచక్రాధిపుడవై ప్రపంచమంతయుఁ బాలించుము" అని పలుక నాబాలుడు "ఓ సచ్చిదానందమూర్తీ, గాజుముక్కకై వెదకుచుండ దివ్యమాణిక్యము దొరికినట్లును, జలబిందువుకై వెదకుచుండ అమృతకలశము దొరికినట్లును, రాజ్యాధిపత్యమునకై వెదకుచుండ నఖండసచ్చిదానందమూర్తివగు నీదర్శనము లభించినది. దేవా, నాకేల! పూర్ణసంతుష్టుడనైతి సర్వవాంఛాశూన్యుడనైతి ఆనందభరితుడనైతి" నని ప్రత్యుత్తర మిచ్చెను.

## 144 వ కథ.

ఒకజ్ఞానిచెంతకుఁ భార్య మిగుల దుఃఖించుచుఁ బోయి "ఆచార్యా మన యేకపుత్రుఁడు జచ్చెను" అని యేడువసాగెను. అంతఁ జ్ఞానికంఠమునుండి కన్నీరు కాల్వలై పారెను. అప్పుడు దగ్గరనున్న శిష్యుడు తనగురువు దుఃఖించుటజూచి గురువుకంటె నెక్కువగానేడ్చెను. అంతటగురువు శిష్యుని జూచి "శిష్యరత్నమా, నీవెందుకు దుఃఖించుచున్నా" వని యడిగెను. శిష్యుడు "గురువరా, నామందుకు ఏడ్పుచుం త్రిగో నెంవట సెలవిండు" అని యడుగ గురువు "ఓరీ, నాపుత్రుడు చచ్చెనని నే నేడ్చుచున్నట్లు నీవు భావించితి వేని అట్లు కాదు. నాపుత్రునివాఁడు జచ్చెనని దుఃఖించుఁవారల అజ్ఞానమును జూచి ఆచార్యా నేనింతకాలము బోధించిన దంతయు నిష్ప్రయోజన మయ్యెగదా యని దుఃఖించితిని గాని మఱియొకటి కాదు. ఇక నీవేడ్చుటకేమి కారణమో చెప్పుము" అని పలుకఁ శిష్యుడు "దేవా నీవంటి జ్ఞాన సంపన్నునికంటెను నేను నాది యను అహంకారమును

కారము లించుకయుండి యిప్పుడు పుంశిఖమునకు గాఁ మయ్యెగదా యని దుఃఖించితిననెను. అప్పుడు గురువు తన శిష్యుడు తనకన్న మించినవాడయ్యెనని సంతసించెను.

## 145 వ కథ.

ఒకరాజు తన మంత్రికి లక్షరూపాయలు నిచ్చి సన్న్యాసులకుఁ బంచిపెట్టుమని యాజ్ఞాపించెను. బుద్ధిశాలియగు నామంత్రి సరే యనిపోయి మరునాడు తిరిగి యాధనరాశి నంతయు రాజుయెదుటఁబెట్టి "రాజేంద్రా నాకెవ్వరును సన్న్యాసులు గన్పించరే" యనెను. రాజాశ్చర్యమున "ఏమి సన్న్యాసులే కనుపించలేదా! మనపురమందు వేలకొలఁది సన్న్యాసులుండ నొక్కడైన గాన్పించలేదని బలుకుట కడు వింతగా నున్నది" యనెను. అప్పుడామంత్రి "దేవా నిజమైన సన్న్యాసి ధనముఁ స్వీకరించడు. ధనముఁ స్వీకరించువాడు సన్న్యాసి కాడు. గాన మీరిచ్చిన ధనము నెట్టివినియోగపరచవలసినది నాకుఁ దెలియక తిరిగి తెచ్చితి" ననెను. రాజు మంత్రియొక్క బుద్ధికుశలతకుఁ సంతసించెను.

## 146 వ కథ

ఒకానొకరాజు గలఁడు ఆరాజు తనయాస్థానపండితుని కీమూఁడుప్రశ్నల నిచ్చెను.

1. దేవుఁడెక్కడఁ గూర్చుండును ?

2. దేవుఁ డేదిక్కు జూచుచుండును ?

3. దేవు డేమి చేయుచుండును ?

ఈప్రశ్నలకు సదుత్తరము నివ్వనిచో శిరచ్ఛేదనము చేయింతునని యాజ్ఞాపించెను. అంత నాపండితుఁడు మిగుల భయముగలవాఁడై 10 దినములు సావకాశమడిగి యింటికి బోయి యేమియుఁ దోఁచక మంచమెక్కెను. ఇట్లుండ జ్ఞానసంపన్నుఁడగు నాపండితుని సేవకుఁడు తనయజమానుని దుఃఖమునకు గారణము దెలిసికొని, పండితుని యూరడించి రాజుచెంతకుఁ దానుబోయెను. చింకిగుడ్డలు కట్టుకొని కడుమూఢునివలె నున్నయాసేవకుని జూచి రాజు ఆశ్చర్యమునొంది నీవెందుకు వచ్చితివనెను. సేవకుఁడు ఓభూపాలాగ్రణీ, మీరు మాయజమానునకిచ్చిన ప్రశ్నల కుత్తరముఁ

చెప్పుటకు వచ్చితిని. నాయజమానుఁడు జబ్బుగానున్నందున నన్నుబంపించెను. ఇది మీకిష్టమేనా యనెను. రాజు "ఓహో యిష్టమైననేమి. కాని నీవు చెప్పలేనిచో ప్రాణములు గోల్పోవుటకు సిద్ధముగానుంటివా యనెను అంత సేవకుఁడు సిద్ధమేగాని నేనొకకోటి మిమ్ములఁగోరుచున్నాను. బోధకుఁడున్నతస్థానమందును, బోధింపబడువాఁడు క్రిందను గూర్చుండుట శాస్త్రసిద్ధము. అది మీకు సమ్మతమైనచో నేను చెప్పునంతవరకుఁ మీసింహాసనము నాకిచ్చిమీరు క్రిందఁ గూర్చుండవలెననెను. రాజు అందుకంగీకరించి యాసేవకునిఁ సింహాసనముపైఁ గూర్చుండఁజేసి తాను క్రిందఁ గూర్చుండెను. అప్పుడు సేవకుఁడు కొన్నిపాలఁ దెప్పించి "రాజా యిందు వెన్నయున్నదా లేదా? చెప్పవలెననెను. రాజు "ఉన్నదనెను సేవకుఁడు ఎచటనున్నదో చెప్పవలెననెను. రాజు కొంచమాలోచించి అంతటా యున్నదనెను. సేవకుఁడు, భగవంతుఁడును అదేవిధమున నంతట నున్నాఁడని చెప్పెను. పిమ్మటఁ ఒకదీపము వెలిగించి "రాజా యీ

దీపము యేవైపు ప్రకాశించుచున్న దనెను. రాజు అన్నివై పులం బ్రకాశించుచున్న దనెను. అప్పుడు సేవకుఁడు భగవంతుఁడును ఇక్కడ చూచుచున్నాడని చెప్పెను. పిమ్మట దేవుఁ డేమిచేయుచుండు ననెడు మూఁడవప్రశ్నకు నిట్లుఁ జెప్పెను. "రాజా యిప్పుడు నీ వెచట నున్నావు? రాజు సింహాసనముపై నున్నావు అనెను. సేవకుడు రాజా నీ వెచటనున్నావు? అనెను. రాజు నేను క్రింద నున్నాననెను. అంతేఁ సేవకుడు రాజా భగవంతుడు రాజునిఁ సేవకునిగను, సేవకుని రాజునిగను, ధనవంతుని దరిద్రునిగను, దరిద్రుని ధనవంతునిగను, కీర్తివంతుని కీర్తిహీనునిగను, కీర్తిహీనుని కీర్తివంతునిగను, యెప్పుడును మార్పులనుఁ జేయుచుండునని చెప్పెను. అంత రాజు మిగులఁ సంతసించి వానికిఁ తగు బహుమాన మిచ్చిపంపెను.

## 147 వ కథ.

పరీక్షిన్మహారాజునకు శ్రీశుకులవారు ఏడుదినములలో తత్త్వోపదేశముఁజేసి ముక్తునిజేసెననెడి భాగవతకథను ఒకఁ

రాజు విని తనపురోహితునిఁ బిలిపించి తనను కూడా ఏడు దినములలో ముక్తునిఁ జేయుమని యాజ్ఞాపించెను. అటులఁ జేయకుండిన యెడల శిరచ్ఛేదనఁ జేయింతునని భయపెట్టెను. పురోహితుడు మిగులఁ భయముజెందినవాడై అను దినము వనశక్తినంతయు నుపయోగించి బోధించుచుండెను గాని రాజునకించుకయును జ్ఞానోదయము కలుగలేదు. పురోహితుడు మిగులఁ దిగులొంది ఏడవదినమునఁ దన జీవితము నేటితోఁ సరిగదాయని కడుదుఃఖయుక్తులవాడై భార్యాపుత్త్రలను జూచి రోదనసాగెను. అప్పుడు ఒక్కతె జ్ఞానసంపన్నురాలగు నాతనికుమార్తె తాను రాజును సమాధానపరతునని తండ్రికి ధైర్యముచెప్పి రాజువెంటకిద్దరును బోయిరి. పిమ్మట రాజును దర్శించి “రాజా మీరు మాతండ్రికిచ్చిన యాజ్ఞ నేమని యడిగెను. రాజు “శుకులవారు పరీక్షిత్తుకు ఏడు దినములలో బంధవిముక్తునిజేసి ముక్తిసామ్రాజ్య మొందజేసెను. నాకును అట్లే చేయుమని ఆజ్ఞాపించితి ననిచెప్పెను. అంత నాసాక్ష్యమునే రాజా నేను చెప్పినట్లు మీరు చేసినయెడల మీకు దగుసమాధానము గలుగు ననిచెప్ప

రాజు నందుల కంగీకరించెను. పిమ్మట నాయువతి నొకకత్తిని నొకపెద్దత్రాడును దెప్పించి నాత్రాటిచే తనతండ్రిని యొక స్తంభమునకు చేతులుకాళ్ళు ఘట్టిగ బిగించి కట్టెను. పిదప వారి సందేశార్థమునకు రాజును మరియొక స్తంభమునకుఁ గట్టెను. పిమ్మట నాకత్తిని తండ్రిచేతి కిచ్చి రాజుత్రాళ్ళను గోయుమని చెప్పెను. అంతట నాతఁడు అయ్యో, యీ విధమున నేను బంధింపబడియుండ రాజు త్రాళ్ళను గోయు టెట్లు? అనిచెప్ప నాయువతి యాకత్తిని రాజుచేతిలో నుంచి రాజా మాతండ్రిని విడిపింపుమని చెప్పెను. అంతఁ రాజు ఆశ్చర్యముతో ఓహో నేనే బంధింపబడియుండ నీతండ్రిని విడిపించుటెట్లు? అనియనుగఁ నాజ్ఞానసంపన్నురాలు " రాజేంద్రా బంధరహితుండవగు శ్రీ శుకులు పరీక్షిత్తునకు బంధవిముక్తుని జేయగలిగెను గాని సంసారపాశములచేఁ బంధింపఁబడిన మాతండ్రి యిమ్ము బంధములనుండి యెట్లువిముక్తునిఁ జేయగల్గును? అని హితోపదేశముఁ జేసి రాజును సంతృప్తిపరచి తండ్రినిమరణమునుండి రక్షించెను.

## 148 వ కథ.

లోకవిఖ్యాతుండును తపస్సంపన్నుండు నగు చక్రవర్తి శాస్త్రవిచారణం జేయుచుండగా "మోక్షము క్షణము లోనే లభింపగలద"ని యొకగ్రంథమునందు గాంచి తన యాస్థానమందుండు పండితులను, శాస్త్రవేత్తలను యీవచనము విశ్వసింపదగినదో కాదో యని ప్రశ్నించ వారందరు యీగ్రంథమున అంతులేనిదియు సందేహము లేదని బల్కిరి. అంతట నారాజు తన కట్టి మోక్షము క్షణములోఁ లభించునట్లు జేయవలెని ప్రార్థించ వారట్లు చేయజాలమని ప్రత్యుత్తర మిచ్చిరి. అంతులకుఁ రాజు ఆగ్రహచిత్తుఁడై వారందరిని గారాగృహమునఁ బడవేసెను. పిమ్మట గనబడిన విరాగులను, సన్యాసులను, బోధకులను రావించి యిట్లే ప్రశ్నించుచు వారును యిట్లే చెప్పుటచే నందరినిఁ గారాగృహమున బంధించుచుండెను. ఇట్లుండ నొకనాడు ఆత్మవిజ్ఞాన పూర్ణుండును, మునిశ్రేష్ఠుండును నగు అష్టావక్రుని రాజుచెంతకుఁ భటులు బట్టితెచ్చిరి. అంత రాజుపూర్వమువలెనే

ప్రశ్నింప నాముని క్షణములో ముక్తునిఁ జేయుట కంగీకరించి రాజును నొక ఘోరారణ్యమునకుఁ దీసుకొని పోయెను. అచట రాజును నిలుచుండుట కాజ్ఞాపించి నీవు నాకు దక్షిణ యిచ్చుటకు సిద్ధముగనుంటివాయని యడుగఁ గంములకుఁ రాజు "ఓహో మీ రింతటి మహోన్నతపదవిని దయచేయుచుండఁ గురుదక్షిణ కేమితక్కువ! మీరు కోరినదంతయు నిచ్చుటకు సిద్ధుడనై యున్నా" నని చెప్పెను. అంత నాతాపసేంద్రుడు "రాజా నీమనస్సును నాకు దక్షిణగా నొసంగుము" యనెను. రాజు అందుల కంగీకరించి మనోశూన్యుండై యుండెను. అంతనిశ్చలుండై నిర్వికల్పసమాధియందు మున్నై అఖండసచ్చిదానంద పరబ్రహ్మను పొందెను.

## 149 వ కథ.

ఒకరాజు అనిత్యములగు విషయసుఖములను రోసి విరాగియై తనయథార్థస్థితినిఁ దెలుసుకొనఁగోరి యొకమునిసత్తము నాశ్రయించి వానివలన సమస్తశాస్త్రములను తెలుసుకొను

వడు వానిం జూచి «శిష్యరత్నమా నీవు నాసెలవు వైకొ
నక నాకు నమస్కరించక నే బోధచుంటివి ఇది న్యాయ
మేనా? యనెను. అంత నాశిష్యుండు ఈయనంతకోటిరూ
పములును నారూపము లైయుండ నే నెవనికి నమస్క
రింతును అని చెప్ప నాతాపసేంద్రుడు నీ శిష్యుడుగదా
పూర్ణజ్ఞాని యని మెచ్చి మిగుల సంతసించెను.

## 150 వ కథ.

శంకరులవారు గంగానదిలోఁ స్నానముఁ జేసి తన సన్న్యాసమఠమునకుఁ వచ్చుచుండగాఁ త్రోవలోఁ బ్రహ్మజ్ఞాని యగునొకమాలవా డెదురుపడెను. అప్పుడు శంకరులు «ఓరీ ఛండాలా యెంత నిర్లజ్జయగా నా దగ్గరకుఁ వచ్చితివి! పో దూరముపొమ్ము" అని పలికెను. అప్పు డాబ్రహ్మవేత్త చిరునగవుతో ఓసాధుపుంగవా, నేను దూరముగా తొలగు మనునది ఈస్థూలశరీరమునా, సూక్ష్మశరీరమునా, లేక ఆత్మనా? స్థూలశరీరము నైనచో నీశరీరమును నాశరీరమును గూడ పంచభూతాత్మికములే గదా! సూక్ష్మశరీరము నైనచో

మనోమయు మైనది గనుక నీవెంత నిష్కళంకమైనవో నాదియు నంతనిష్కళంకమైనదే సుమా! ఆత్మజ్ఞానమో యది సర్వవ్యాప్తమై యచంచలమై యున్నది. గావున నీవెందు కేనిని తొలఁగమంటివో చెప్పుమన శంకరులు యాతని బ్రహ్మవేత్తయని గ్రహించి "బ్రహ్మజ్ఞానియగువాఁడు బ్రాహ్మణుడైనను ఛండాలుఁడైనను నాగురువుగా భావింతు" నని చెప్పి యాతనికి సాష్టాంగదండప్రమాణ మాచరించి వెడలిపోయెను.

## 151 వ కథ.

నాస్తికుఁడను నొకానొక గొప్ప శాస్త్రజ్ఞుఁడు, తత్వవేత్తయు బ్రహ్మజ్ఞానియు నగు సోక్రటీసుతో నీవు దేవుఁడు దేవుఁడన్న వాఁ డెక్కడ నున్నాఁడో యని భూమండలమంతయు వెదకితిని సూర్యమండలము చంద్రమండలము నక్షత్రమండలమంతయు మిక్కిలి శ్రేష్ఠతరమగు దూర్బిణియంత్రములతో బారజూచితిని గాని యెక్కడను గన్పించలే దనెను. అంతట సోక్రటీసు "నీవు, మరియొక యంత్రముతో జూచుట మఱచితివి

సుమా! అనిచెప్ప నాశాస్త్రిజ్ఞుడు ఆయంత్రమేమని యడిగెను. అంతటాతత్వవేత్త భక్తి, విచారణ, వైరాగ్యములనెడి యద్దములను మనస్సనెడి యంత్రమునకు సమర్చి జూచినయెడల భగవంతుడు తప్పక గోచరించును అనిచెప్ప నాశాస్త్రిజ్ఞుడు వానికి శిష్యుడై భగవంతుని యథార్థస్థితి దెలుసుకొని నిశ్చలానందమున నుండెను.

## 153 వ కథ.

నొకానొక బ్రహ్మజ్ఞాని, సర్వదా ప్రాపంచకసుఖములయందే కాలముగడుపుచున్న నొకరాజు పట్టణమునకుఁ వచ్చెను. రాజా ఆమహాపురుషుని కీర్తి విని వానిం జూడ దలంచి తనయాస్థానమునకుఁ రావించి తనప్రక్కనే గూర్చుండనియమించెను. గాని యాతపోధనుడు రాజువంకనైన జూడక వానితో నొక్కమాటయైన ముచ్చటించక యచటనున్న సేవకులతో ముచ్చటించుచుండెను. రాజాతని విపరీతకృత్యమునకును తనకుఁ జేసిన యవమానమునకును కోపోద్దీపితుడై యాబ్రహ్మవేత్తను శిరచ్ఛేదనచేయుమని యాజ్ఞాపిం

చెను. అప్పుడామహనీయుడు "ఓ రాజా నీలో మెచ్చుటిం చక, నిన్ను గౌరవించక నీసేవకులతోడనే కాలముగడపి నందున నాకు శిరచ్ఛేదన విధించితివిగదా! రాజులకెల్లను రాజైన భగవంతుని స్వప్నమునందైనను దలంచక దుచ్ఛములగు నిహలోక సుఖములయందే కాలముబుచ్చుచున్న నీకు సర్వేశ్వరు డెట్టిశిక్షను విధించునో తెలియకుంటివి గదా?" యనెను. అంత నారాజు తనయవివేకమును దెలిసుకొని పశ్చాత్తాపమునొంది నాబ్రహ్మవేత్తపాదములపైఁ బడి యాతని యనుగ్రహమునుఁ బొంది సన్మార్గుడయ్యెను.

## 153 వ కథ

ఒకగ్రామమునం దొకసన్యాసి మఠముకట్టించుకొని అందు నివసించుచుండెను. ఆయనకుఁ బ్రతిదినము అక్కడకుఁ సమీపముననున్న యొకపల్లెటూరునుంచి యొకగొల్లది భక్తిశ్రద్ధలతోఁ పాలుఁ దెచ్చి యిచ్చుచుండెను. ఇట్లుండఁ నొకనా డాగొల్లది వేళతప్పివచ్చుటచేఁ నేడింత యాలశ్యముగ నేలవచ్చితి వని సన్యాసి యడిగెను. అప్పు

డామె " స్వామీ యేఱుదాటించువా డాలస్యముగఁ వచ్చుటచేఁ వాడు వచ్చువరకుఁ గాచుకొనియుంటి " యనిచెప్పెను. అప్పుడాసన్యాసి " ఓహో యేఱు దాటుటకు ఒకరు దాటించవలయునా? రామనామము నుచ్చరించి దాటలేకుంటివా? " యని పరిహాసమునఁ బల్కెను. మరునాడు ఆగొల్లది ప్రతిదినముకంటె ముందుగాఁ వచ్చి సన్యాసికి నమస్కరించి " తండ్రీ, మీరు నాకుఁ మిక్కిలి యుపకారముఁ జేసినారు. ఇక నెన్నటికిని యేఱుదాటుటకు డబ్బు ఖర్చు లేకనే యుండెడి యుపాయమును నేర్పితిరి. " అనిచెప్ప నాసన్యాసి ఆశ్చర్యమున " నే నేమియుపాయముఁ జెప్పితి " ననెను. అంత నాగొల్లది " స్వామీ, మీ రప్పుడే మరచితిరా! నిన్ననేగదా మీరు పరమపావనమగు రామమంత్రప్రభావమునుఁ జెప్పితిరి! నే నామంత్రోచ్చారణఁ జేసి నిమిషమాత్రంబున యేఱుదాటితినని చెప్పఁ నాసన్యాసి మరింత నాశ్చర్యముజెంది " ఆహా, యేమి దీనివాక్యములు! దీనిని బరీక్షింపవలె ననిగొల్లదానిని ముందు నడువమని తాను

వెనుకఁ రామనామము నుచ్చరించుచు నదిలోఁ దిగెను గాని పాపము మునుగుచుండెనే గాని తేలదయ్యె. అంతనాగొల్ల దానితోఁ అయ్యో యిదేటి యాశ్చర్యము, నీవు నీటిపైఁ స్వేచ్ఛగాఁ బోవుచుంటివి గాని నేను మునుఁగుచుంటిని! అని పలుకఁ నాగొల్లది తిరిగిజూచి "ఓహో స్వామీ మీమంత్రమున్నా మీకే నమ్మకము లేదే! నమ్మకమే యున్నయెడలఁ మీరు యేటిలోఁ దిగునప్పుడు బట్టలు తడుచునేమో నని పైకెత్తికట్టుకొందురా?" అని చెప్ప నాసన్యాసి సిగ్గుపడి తనకింతనుఁ పూర్ణమైనభక్తివిశ్వాసములుఁ గలుగలేదని చింతించి తిరిగి పోయెను.

## 154 వ కథ.

దేశదేశములఁ దిరుగుచుఁ మహోపన్యాసములఁ గావించుచున్న యొక సంఘసంస్కర్త ఒకనాఁడొకయవధూతనుఁ జూచి "స్వామీ నేనెన్నియుపన్యాసములు చేసినను సమస్తశాస్త్రములలో నుండెడి పాండిత్యమంతయు వెదజల్లినను నామతమవలంబించువారు మిక్కిలిస్వల్పము.

మీరువున్నతావునుండి కదలకున్నను సదా ధ్యానమునే ధరించియున్నను మీశిష్యులసంఖ్యకు మేరలేదు. ఇందుకుఁ గారణమే "మని యడిగెను. అందుల కాయవధూత "దీపము పురుగులను తనచెంతకుఁ రమ్మని పిలుచకున్నను వేనవేలు దానిచుట్టునుఁ జేరి అందు దుముకుచుందును. పుష్పములు తమయందుండెడి మకరందమును పానము జేయుమని నాహ్వానముజేయకున్నను తుమ్మెదలు తమంతట దామే బోయి దానినిద్రావి యానందించును. అదేవిధమున నీయందుగల బరమాత్మను బ్రకాశింపజేసినయెడల నీవు బిలువకున్ననుమనుష్యులందరు నీచుట్టునుజేరి నీకుదాసత్వము జేయుచుందురు. మనుష్యులేగాక పంచభూతములు సహితము నీయాజ్ఞకుఁ లోబడియుండును సుమా!" అని జవాబు చెప్పెను.

## 155 వ కథ.

కార్తికేయుఁ డొకదినమున నొకపిల్లిని గోళ్లతో గాయపరచెను. తరువాత నాత డింటికి వచ్చినతోడనే తన తల్లి

యగు పార్వతీదేవి బుగ్గమీద నొక గాయమును జూచి ఆశ్చర్యపడి, అమ్మా యిదేమి! యీగాయమెట్లు గలిగెను, అని యడిగెను. ఆదివిని యాజగజ్జనని "నాయనా అది నీవ ల్లనే గలిగినది. నేడు నీవు పిల్లిని గిల్లితివిగదా, ఆగెల్లు నాబు గ్గపై నున్నదని చెప్పెను. కార్తికేయు డాశ్చర్యముతో "అమ్మాయిదెట్లు" అని యడుగ "యీజగమంతయు నాశ రీరమే" యని పార్వతి బదులు చెప్పెను. కార్తికేయుడు విస్మయమొంది "అమ్మా యికనే వివాహము చేసుకొనను. స్త్రీలందరును నాతల్లిస్వరూపులే యైయుండ, నేవివా హము చేసుకొనుటెట్లు అని తనకాలమంతయు బ్రహ్మచారి గానే యుండెను.

## 156 వ కథ.

ప్రపంచ మంతయు భగవత్స్వరూపమే యని యొక గురువు బోధించుచుండెను. అది వినుచున్న ఒకశిష్యుడు ఒకనాడు మార్గమున బోవుచుండగా యేనుగొకటి కనుపిం చెను. మావటివాడు యెంతచెప్పినను వినక అంతా భగ

వత్స్వరూపమేగదా యేనుగ నన్నేమిచేయును" అని అనుచు దగ్గరకు వెళ్ళెను, గాని పాపమాతనిని నాయేనుగ తొండముతో బట్టి నావల విసరివైచెను. అందుచే ఒడలంతయు దెబ్బలు తగిలి మిక్కిలిబాధతో గురువుల వారి చెంతకు బోయి "స్వామీ మీమాటలునమ్మి మోసపోతిని" అని జరిగిన వృత్తాంతమంతయు చెప్పెను. గురువు వాని యవివేకమునకు విచారించి ఓమూఢా అంతయు భగవత్స్వరూపమే యనిగదా నేను చెప్పితి. మావటివాడు మాత్రము భగవత్స్వరూపము కాదా. అట్టైన భగవంతుడు నిన్ను దూరముగ పొమ్మని చెప్పుచుండ నీవు వినక దగ్గిరకు వచ్చినందుకు భగవంతుడే నిన్ను శిక్షించెనని జవాబు చెప్పెను.

## 157 వ కథ.

పండితమదనమోహన మాళవ్యాగారు ఒకనాటి యుదయమున క్షురకర్మ చేయించుకొనుచు మీసములను గూడ గొరిగించుకొనెను. అప్పుడొక స్నేహితుడు దానిం జూచి

ఆశ్చర్యముతో మీసములు దీయుటకు కారణ మడిగెను అప్పుడా పండిత శ్రేష్ఠుడు "మిత్రమా, భారతభూమి యందు నాసోదరులు పడరాని బాధలు పడుచుండ కన్నులార జూచుచు వారికేయుపకారమును చేయజాలని పురుషత్వ మెందుకని జవాబు చెప్పెను.

## 158 వ కథ.

వ్యాసులవారు యమునానదిని దాటబోవుచుండగా, కొందరు గోపికలువచ్చి స్వామీ, మేమున్నూ దాటవలసి యున్నది. గాని నావగాని దారిగాని యేదియు లేదు. నేమి యుపాయమని ప్రార్థించిరి. అప్పుడు వ్యాసులు మంచిది నేను మిక్కిలి యాకలిలో నున్నాను. ముందునాకు దినుట కేమైనబెట్టుడు అని యడిగెను. అప్పుడు గోపికలు తమవద్ద యున్న పాలును మీగడను బెట్టిరి. వ్యాసులు వాటిని బొట్ట నిండ నారగించి నదియొద్దకు వచ్చి "ఓ యమునా, నేను యీరోజున నిశ్చయముగ ఉపవాసము చేసినవాడనైతి నేని వెంటనే దారినిమ్ము" అని యడిగెను. తోడనే యమునానది

రెండుభాగములుగా చీలి మధ్యమదారి యిచ్చెను. గోపికలు ఆశ్చర్యమగ్నులై "దేవా యిదేమివింత నీవు రిక్తుఁడేగదా కడుపునిండ తింటిరి. తినలేదని యెట్లు అసత్యము లాడితిరి అని యడిగిరి. అంత యామునిపుంగవుఁడు "తల్లులారా నేను చేయు కార్యములనన్నింటిని భగవదార్పణము చేయుదును. యీ పస్త్రాతమైనను అహంభావము లేక సర్వము భగవదార్పణమును చేసితినిగాని నేనే తిన్నాననెడి యహంకారము నాయందు బూర్ననుగ నెంచినవని జవాబు చెప్పెను.

### 159 వ కథ.

గాంధి మహాత్ముఁడు ఆఫ్రికాదేశము నందుండగా యీర్ష్యాపూరితుఁడగు నొక దొర మహాత్ముని శిరముపై కర్రతో గొట్టి పారిపోయెను. అప్పు డమ్మహానీయుని తలబ్రద్దలై రక్తము కాల్వలైపార స్పృహతప్పి నేలపై బడెను. అప్పు డాయన స్నేహితులు వారికి తగుచపచారములు సల్పి స్పృహకు దెచ్చిరి. ఆమహానీయుడు స్పృహకు వచ్చినతోడనే

“ యేడీ నన్ను గొట్టినవాడు ” అని మెల్లగానడిగెను. అంత వారు “ అయ్యా శాంతింపుడు. మిమ్ము గొట్టిన యా దురాత్ముని బట్టుకొని బంధించితిమి ” అని చెప్పిరి. అప్పుడా కరుణానిధి “ అహా యేమంటిరి. అతనిబంధించితిరా అతను నామిత్రుడే. నే చేసినపాపములకై నన్ను శిక్షించి పాప విముక్తునిగా జేసిన పుణ్యాత్ముడే. అట్టి నామహోపకారిని మీరు విడచిపెట్టినగాని నేనిక్కడనుండి కదలను ” అని చెప్పినంతనే వారాతనిని విడచిపెట్టిరి. లోడనే యాచోర తనపాపకృత్యముకై వగచి యామహాత్ముని నిరుపమాన దయా శీలతకు విస్మయముజెంది వారి పాదములపై బడి క్షమాపణ వేడెను.

## 160 వ కథ.

శిష్యుడు—గురువర్యా భగవంతుని తెలుసు కున్నవాడె వ్వడు ?

గురువు— తెలుసుకొనజాలనని తెలుసుకొన్నవాడే భగ వంతుని తెలుసుకొన్నవాడు.

శి—గురువర్యా ! భగవంతుని తెలుసుకొననివా డెవ్వడు?

గు—శిష్యా, భగవంతుని తెలుసుకొన్నానని తలంచువాడే తెలుసుకొననివాడు.

## 161 వ కథ.

ఆంజనేయులు సీతామహాదేవిని వెదుకుటకై లంకకు బోయి తిరిగి వచ్చి రామునితో లంకాపురిని గురించి యిట్లు విన్నవించెను. “ఓ రామా, జగదభిరామా, లంకాపురిని గురించి నేనేమని వర్ణింతును. ఎక్కడ జూచినను జపము లాచరించువారును, తపములు చేయువారును, ఎందు జూచినను యజ్ఞయాగాది క్రతువులు జేయువారును, నిష్ఠతో పూజలు సల్పువారును గాన్పించిరి. స్త్రీలని లేక బాలురని లేక, వృద్ధులని లేక ప్రతివారును వేదపారాయణ జేయుచు వీనులకు విందు గొల్పిరి ”. ఈమాటలు వినినంతనే శ్రీరాముడు అయ్యో ఆంజనేయా యికనాకు సీత దక్కుట యెక్కడిది! అట్టి తపోనిష్ఠా గరిష్ఠులపై నాబాణము పోజాలదు. అట్టివారిని నేజయించుటెట్లు, సీతనుదెచ్చుటెట్లు

యున్న «రాజా యిదియును మీమేలుకే భగవంతుడు చేసి నాడ" నెను. రాజాగ్రహమునొంది మంత్రిని కారాగృహమున బంధించెను. కొన్ని రోజులు గడచిన పిమ్మట రాజు లేటకి వేటకుబోయి దారితప్పి ఒంటరిగా కొంకలచేతికిక్కెను. ఆకొంకలు శక్తిపూజ చేయువారలు. శక్తిని బలినిచ్చుటకై నుంచి రూపవంతుడును, బలవంతుడును, అగు మనుష్యుని కొరకు వెదకుచు రాజును వంటరిగా జూచినంతనె మిగుల సంతసమునంది రాజును బంధించి దేవళమొద్దకు తీసుకు బోయిరి. అక్కడ రాజును కూర్చుండబెట్టి నరుకబోవు చుండు యాతని యంగములు సరిగ యున్నవో లేవోయని పరీక్షించి చేతియందు వక వ్రేలు లేకుండుట జూచి అయ్యో! అంగహీనుడు బలికి పనికిరాడనుచు రాజును విడచి వెళ్ళిపోయిరి. అప్పుడు రాజు మహదానందము చెంది మంత్రి చెప్పిన హితవాక్యములు జ్ఞప్తికి వచ్చి ఆహా! యా పరమేశ్వరుడు మనకు చేయునదంతయు మనమేలునకే గదా యని తలపోయుచు మంత్రిని విడచిపెట్టి అనేక విధముల సన్మానించెను.

## 163 వ కధ.

యేసుక్రీస్తులవారియొద్ద కొకడు బోయి అయ్యా భగవంతుని జూచు టెట్లని యడిగెను. అంతయాభక్తాగ్రేసరు డాతని నొక చెరువులోనికి దీసుకునివెళ్ళి తలగట్టిగా బట్టుకుని నీళ్ళలోముంచి కొంచము సేపుంచెను. అప్పుడాతడు గిలగిల తన్నుకొనగా విడచిపెట్టి యిట్లు జవాబు చెప్పెను. “నీవు భగవంతుని జూడదలచిన యడల నీళ్ళలో నీతల ముంచినప్పుడు వైటకు వచ్చుటకు నీవెంత గిలగిల కొట్టుకొంటివో భగవంతుని జూచుటకు అంత పరితపించినగాని గాన్పించడ”ని జవాబు చెప్పెను.

## 164 వ కథ.

భక్తుడగు నొకబ్రాహ్మణుడు మార్గమున బోవు చుండగా దాహమయ్యెను. అప్పుడొకమనుష్యుడు చేతనొక ముంతలో మంచినీరు దీసికొని పోవుట జూచి యాతని బిలచి అయ్యా కొంచము మంచి నీరిచ్చెదవా యని అడిగెను. అప్పుడా మనుష్యుడు అయ్యా నేను మాలవాడను. మీరు బ్రాహ్మ

ణాలు. నేను తాకినసీరు వీరెట్లు ద్రాగుదురనెను. అంతటా భక్తుడు సోదరా, రామనామము నొక్కసారి వుచ్చరించుము. అది సమస్త దోషములను హరింప జేయును. యెట్టి పాపాత్ముడైనను పవిత్రము జేయును అని వానిచే రామనామ ముచ్చరింపజేసి వానిచేతిలోని నీరు ద్రాగెను.

సమాప్తము.

*For Copies Apply to:—*

**A. JAGAN MOHAN ROY,**

*Masulipatam.*

# ప్రకటన.

## —‡ 1. భక్తియోగము. ‡—

మహాత్మ అశ్వినికుమారదత్తు ఎం. ఎ. బి. యల్. గారి విర చితము. బంగాళీభాషనుండి తెలిగింపబడినది. ఇది భక్తునికి కావల సిన సాధనము లతివిపులముగను పండితపామర హృదయరంజకం బుగా ప్రతిగృహమును అలంకరింపదగిన యమూల్యగ్రంథము. మూడ్రవముద్రణము. 360 పుటలుగల దివ్యమైన క్యాలికో బైండు. ప్రతి రు. 1—8—0

## —‡ 2. ఆత్మరామాయణము. ‡—

శ్రీ శంకరానంద యతీశ్వర ప్రణీతము. హిందీభాషనుండి అనువాదితము. శ్రీమద్రామాయణ మహాకావ్యముయొక్క గూఢా ర్థము బహుహృద్యముగ వెల్లడింపబడి స్త్రీలుగూడ చదివి ఆనందిం చునట్లుల తేటతెనుగున వ్రాయబడినది. 245 పుటలుగల దివ్యమైన క్యాలికోబైండు ప్రతి రు. 1—8—0.

## —‡ 3. పూర్ణయోగము. ‡—

అరవిందయోగిగారి గ్రంథముల ననుసరించి వ్రాయబడినది. ఇందు 3 భాగములు గలవు. 1. పూర్ణయోగము, 2. యోగసా ధన, 3. భగవద్గీత. ఈ గ్రంథముగు చదివినయెడల మానసికశా

స్త్రీను సంపూర్ణముగను, వివరముగను తెలియును. తెలుగు భాష యందిట్టి గ్రంథమును యెవరున్ను ఇంతవరకు ప్రచురించియుండలేదు. దివ్యమైన క్యాలికోబైండు ప్రతి రు. 2—0—0.

## —‡ 4. వేమనసూక్తి రత్నాకరము. ‡—

ఇన్ని వేమనపద్యములు మరెక్కడను దొరకవు. ఇందు 4035 పద్యములున్నవి. మరియు వేమనయోగిగారి చిత్రచరిత్రము, తేటతెనుగున వ్రాయబడి అందు టీకాతాత్పర్యములుకూడ చేర్చబడినవి. వెల రు. 2—0—0.

## —‡ 5. శ్రీమద్భాగవతసారము. ‡—

భాగవతముయొక్క సారమంతయు వచనమున బహుచక్కగా వ్రాయబడినది. రు. 1—8—0.

## —* 6. పార్థివ పదార్థచికిత్సా చంద్రిక. *—

(*Tissue Remedies.*) టిష్యూరెమిడీస్ పేరుగల 12 మందులు, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికాలో ప్రతియింటను వాడుటయే గాక మనదేశమందిప్పుడు ధారాళముగ వాడుకలోనున్నవి. ఇవి ప్రమాదరహితములు. ఈ గ్రంథము తెలుగున అతిసులభముగ వ్రాయబడినది. దీని సహాయమున స్త్రీలుగూడ వైద్యము చేయుకొనవచ్చును. ప్రతియింట నుండదగినది. దివ్యమైన క్యాలికోబైండు రు. 2—0—0.

## —‡ 7. భక్తిమార్గము. ‡—

శ్రీపరమానంద స్వాములవారు ఆంగ్లేయభాషను రచియించిన గ్రంథమున కాంధ్రీకరణము. మానవుడు జీవయాత్ర సుఖముగ గడుపుటకును నిత్యపదవి నొందుటకును యెటుల ప్రారంభించి వృద్ధి నొందవలెనో విపులముగ చర్చింపబడినది. ఇందు 1 భక్తి 2 నిర్మలత్వము, 3 నిశ్చలత్వము, 4 నిర్భయత్వము, 5 ఇంద్రియనిగ్రహము అను అంశములుగ విభజింపబడి యొక్కొక్క విషయము ఎట్లు ఆచరణీయమో తెలుపబడిన ఉత్కృష్టగ్రంథము.

రు. 0—4—0.

## —‡ 8. జ్ఞానామృతము. ‡—

ఇందు భక్తిరస పూరితములగు ధ్యానశ్లోకములును. నీతిభక్తి జ్ఞాన వైరాగ్యాదు లతితీవ్రముగ పురికొల్పెడి వాక్యరత్నములును, సద్గుణాభ్యాస దుర్గుణవిసర్జనములకు సులభోపాయములును, సాత్విక హారాదులు మొదలైనవి గలవు. ఆరవముద్రణము.

వెల రు. 0—0—9.

## —‡ 9. యాజుషానాహితాగ్ని పితృమేధికప్రయోగము. ‡—

( అపరకర్మలు ) స్వరయావద్ధతులతో 1150 పుటలుగల రెండు సంపుటములు. వెల రు. 3—8—0.

## —‡ 10. వ్రతరత్న మహోదధి. ‡—

తాత్పర్యములతో ముఖ్యమైన వ్రతములన్నియు గలవు.

ప్రథమ భాగము రు 2—8—0.

11. డిటో డిటో ద్వితీయభాగము 2—8—0

## —‡ 12. యాజుష అపరప్రయోగాను క్రమణిక. ‡—

సర్వ సహితము బ్రహ్మమేధప్రయోగధర్మశాస్త్ర సహితము రు. 2—0—0.

## —‡ 13. స్త్రీబాలవైద్య సుధాబ్ధి. ‡—

ఇందు ఆయుర్వేదచికిత్సలు, అంగ్లేయ యూనాని చికిత్సలు, ఆతపస్నానము, జలవైద్యము, అవిరిబట్టట, హోమియోపతి చికిత్సలు, తెలుగు గ్రంథములలో ఉత్తమమైన గ్రంథము. రు. 2—0—0.

## —‡ 14. ఆంధ్రమాత (ఐదంకములు నాటకము). ‡—

ఇందు పంజాబు ఖిలాఫతు విషయములు విఖ్యాత ఆంధ్రులు రామమోహన లజపతిరాయి మొదలగు దేశభక్తుల చరితములు, హిందూమహమ్మదీయ సమ్మేళనము చక్కగా వ్రాయబడినది. 0—12—0.

## —‡ 15. వైశ్యధర్మ ప్రకాశిక. ‡—

3వ ముద్రణము. ఇందు అనేక క్రొత్తవిషయములు చేర్చబడి దివ్యమైన క్యాలికో బైండు చేయబడినది. రు. 3—0—0.

## —* 16. అద్వైతబోధిని. *—

అత్యుత్తమమగు వేదాంతగ్రంథము. ఇందు కొబ్బరి యాహార మునుగురించినిర్విచార జీవనమును గ్రంథమునుండి తెనిగింపబడినది. రు. 2—8—0.

—* 17. శ్రీరంగావధూతలవారి జీవితము. ఉపదేశ వాక్యములు. *—

శ్రీజ్ఞానమాంబయోగినిచే రచియింపబడిన పద్యగ్రంథము. రు. 0—4—0.

—* 18. శ్రీరంగావధూతలవారి జ్ఞానబోధావళి. *—

వెల రు 0—4—0.

19. వాల్మీకివిజయము :— మహామహోపాధ్యాయ హరప్రసాద శాస్త్రి ఎం. ఏ. గారి విరచితము. వంగభాషనుండి తెనిగింపబడినది. ఈగ్రంథము యూరోపియను భాషలలోగూడ భాషాంతరీకరింపబడి, పాశ్చాత్యపండితులచే పరిగ్రహించినది. ధార్మికజను త్ప్రవృత్తియందు సాహిత్యచిత్రములన సమపోషణయందును, భావనాశక్తియందును, వంగభాషలో నీగ్రంథము సాటియొకటిలేదు. రు. 0—10—0

20. పురుషసూక్తము. స్వరము, ఆంధ్రటీకా తాత్పర్యము పదభాష్యములతో 2 వ కూర్పు వెల రు. 0—8—0

21. వైశ్యధర్మదీపిక. వైశ్యులకత్యంతోపయుక్తమైనది. ప్రతి వైశ్యగృహమునందును తప్పకయుండవలసిన గ్రంథము. రు. 1-0-0.

22. పశువధఖండన. (A protest against the torture of animals at religious sacrifices) రు. 0-1-0.

23. పరమార్థవినోదములు. 2 వ కూర్పు వెల. 1-0-0

వలయువారు :— అమ్మూరి జగన్మోహన్‌రావ్,

మచిలీ బందరు, కృష్ణాజిల్లా

